శ్రీః

# శుభోదంతము



విహంగవిజయమను నీ చిట్టిపొత్తమునకు నుపోద్ఘాతము కావలయునని కృతికర్త కోరెను. ఈ కాలపుటాచారము ననుసరించి వ్రాయ సమ్మతించితిని. ఎన్నికలలో నొకపక్షమునఁ జేరి కడుంగడు శ్రమంపడి ప్రతిపక్షుల ప్రచండవాగ్దండనదండితుఁడై తనపక్షము విజయమందఁగా నావిషయము నీ గ్రంథరూపమున వ్రాసినట్లు పొడకట్టెడిని. ఇందుఁగొన్ని పద్యములు గలవు. అవి మిగుల హృద్యములు. నీతిబోధకములు నగుననుట నిర్వివాదాంశము. వానింజూచినంతన జయాపజయములు పామరులకుఁ దక్కఁ దక్కినధీరులకు మోద ఖేదావహములు కావని తోఁచెడిని. ప్రయత్నము చేయునపుడు ద్వేషభావము వదలి దుర్వ్యయ మొనరింపక మెలంగవలయుననియుఁ బొడకట్టెడిని. చకోరపక్షి ప్రయత్నము న్యాయసమ్మతమనియుఁ గంకపక్షి ప్రయత్నము న్యాయవిరుద్ధమనియుఁ గనఁబడును. ఈ పుస్తకమంతయుం జదువఁగా నిరువురొక కార్యమునకుం బూననెందఱో వారిపక్షములఁ జేరి విరోధము పెంతురు కావున నట్టివారిం జేర్చుకొని న్యాయము మీఱరాదను నీతి మదిఁ బొడకట్టక మానదు. ఆయాపాత్రములఁ బోషించుచుఁ గవి చక్కఁగా గ్రంథమును వ్రాసెను. శైలి సలక్షణము. సులభము. ఈ గ్రంథము చిన్నదిగనుండి

నను బెక్కునీతులం గనఁబడఁజేయును. కావున నెల్లరుం బఠించి యెన్నికలంగల తత్త్వము నెఱింగి న్యాయమున మెలఁగుదురుగాక యని కోరెదను. విశేషించి వ్రాయఁదగు విషయములిందు నాకుఁ గనఁబడలేదు. ఈ పొత్తము చిన్నదియైనను గ్రంథకర్తకు యశస్సు నాపాదించుఁ గాక.

ఇట్లు విన్నవించు న్యాయైకపరాయణుఁడు,
నే నే.



శ్రీః

శుభమస్తు.

# విహంగరాజ్యము.



చ. సిరులఁ జెలంగుచున్ మదికి ♦ సిద్ధులఁ గూర్చుచు సాటిలేకయొ
క్కరణినిగూఢతన్ వెలసి ♦ క్రమవిహారపరాయణత్వమ
చ్చెరువుగఁ దోఁప బ్రహ్మమన ♦ సృష్టికి నాదియనంగ జ్ఞేయమై
పరఁగు ననంగఁ దేజరిలు ♦ పంకజయోని యొసంగు సౌఖ్యమున్. ౧

మ. ఖలులన్ బెండుపడంగఁ జేసి బుధులం ♦ గల్యాణసంపత్తిని
స్తులులంగా నొనరించి దీనులకుఁ దో ♦ డ్తో శర్మముం గూర్చి దు
ర్బలులన్ నొంపఁదలంచు నీచమతులన్ ♦ వైళంబ మర్దించి యు
జ్జ్వలతేజంబున వెల్గులోకగురువున్ ♦ భవ్యాత్మ సేవించెదన్. ౨

## మొదటి ప్రకరణము

సర్వసుఖముల కాకరము కాలము. అదియే పరదైవ
మనియుఁ జెప్పఁబడు ఒక్క కాలమున నున్నట్టులుండి సజ్జనుల
భివృద్ధిం గాంచ నెంచఁగా నందఱంగీకరింతురు. ఒక్కపుడ
వ్వారి పెంపుఁ గాంచి చూడఁజాలక కొందఱు దేవానాం
ప్రియులు మహాప్రయత్న మొనరించి దాని నడంతురు. వృద్ధి
చేయుటకుఁ దగ్గించుటకుఁ గారణము కాలము గాని యీ దుర్జ
నులు కారు. వెన్నెలఁ గొన్నినాళ్ళు అంధకారము కొన్ని
నాళ్ళనవిందుము కదా. ఈ విషయమెఱుంగక యల్పులు
తమ ప్రయత్నమున వారి యభివృద్ధిని తగ్గించితిమని గర్వపడు

దురు. వారీపామరులందలంపనైనఁ దలంపక కాలము నాశ్ర
యించి యూరకుందురు. త్రుళ్లిపాటు తూలమునకుం గాని
సువర్ణభాండమునకు నుండదుగదా. అట్టిసకలకార్యములఁ
దాఱుమాఱుసేయఁ గాలమే తగియుండును. కాలమునుపా
సించువారు సకలైశ్వర్యముల దులఁదూఁగుచుందురు. దానిని
లెక్కసేయనివారు జ్యేష్ఠాదేవి యేమూలఁజూచిన నిండియుండ
వెతలఁగుందుచు మనశ్శాంతి లేకయుందురు. కాలతత్త్వము
నెఱింగినవారు శాంతిగలిగి యుందురు. కావున నెల్లరుఁగాలము
నే భగవత్స్వరూపమని భావించి దానినమ్మి యుండవలయు
ననుట యనర్గళద్వారము.

లోకములు మూఁడని, స్వర్గము, మర్త్యము, పాతాళ
మనివాని పేరులని పెద్దలాజ్ఞాపించిరి. యోగదృష్టిగలవారమాట
సత్యమే యందురు. అదిలేనివారది సర్వాసంగతమందురు. వారి
వాదమునకుఁ బెద్దలు బదులు చెప్పుట మేలుకాదని యూరకుం
దురు. ఆయల్పులలోఁ గొందఱు పండితమ్మన్యులు ప్రతిష్ఠంగోరి
వారికిం బ్రదివాదమునఁ బరాజయముగల్గింపఁ బూనుదురు. ఆ
పని పనిలేనిమంగలి సామెతయేకదా యని లోకజ్ఞానసంపన్ను
లూరకుందురు. ఈవాదము ఒక్కమానవజాతియందే కాక
పశుపక్షిప్రముఖజాతులందును గలదు. దానినెఱుంగఁదగినంత
యాతురత మనకు లేదు గాన మనమా ప్రయత్నము చే
యము. వృక్షములు లోనగు స్థావరజాతులకుంగూడ నీమానవ
ప్రయత్నములు గలవని ప్రాజ్ఞులు తెల్పుచున్నారు. దాని
నమ్మువారు కొందఱనఁగూడదు గాని యనేకులు గలరని
చెప్పవచ్చును.

చాలకాలమునకుఁ గ్రిందట ననంతాద్రిచెంత నొకమహారణ్యముండెను. దానిని మానవమాత్రులు ప్రవేశింపఁజాలరఁట. ఆటవికులు కొందఱు ప్రవేశించిరఁటగాని మరల వారు రాలేదఁట. అట్టియడవులకే గహనములని పేరని పూర్వుల మతము. ఆయడవియందే కొందఱు మనుష్యప్రాయులుండిరఁట. వారు మృతప్రాయులని యప్పటివారందురఁట. వారిని వీరు చూడలేదఁట. కాని నానుడినిబట్టి యందు మానవులున్నవారి వీరిట్లను కొనుచుండిరఁట. మృగములకును వారికినించుకయే భేదమఁట. అవియొకజంతువును జంపి యట్లే తినుటవాడుక. వీరట్లుగాక దాని నుడుకఁబెట్టుకొని తినుటవాడుక. ఈపాటి భేదమేగాని విశేషభేదము కానరాదని యందురు. మానవ లక్షణములు సత్యదయాసదాచారములు. అవిలేనినాఁడు మానవులకు మృగములకు భేదమేమి? అట్లాయడవిలో నామానవులు మృగములు పక్షులు సమానసంపత్తిగలిగియుండెను. నరమృగములకంటెఁ బక్షులు లోకజ్ఞానమున మిన్నలన్న సన్నుతింగాంచును. ఏలయన భూగమనము వానికిఁ జాల స్వల్పము. వియద్గమనము ప్రధానము. వియచ్చరులలో దేవతలు గలరు భూచరులలో దేవతలు లేరుగదా. సురలను పేరున్న లాభము లేదు. దేవతాలక్షణము లుండవలయును.

ఒక్కకాలమున నామహాటవి నొక్కమార్పు గల్గెను. మానవులు మృగములు పక్షులు ప్రత్యేకప్రభుత్వమును స్థాపించుకొన నెంచుటయే యామార్పు. అద్దాని కెన్నియో కారణములు కలవు. ప్రధానకారణము, స్వేచ్ఛాప్రవర్తనమే. పరవశత్వము సరిపడినదికాదు. తొలుత నందలిమానవులొకని నా

యకునింజేసికొని యతనికి మంత్రముఁ దెలుపఁ గొందఱ నిర్ణ
యించి వారి యనుమతింగొని తమరెల్లఁ బ్రవర్తింప నిశ్చయిం
చుకొనిరి. మృగములు సభగావించి సింహమును రాజుగా నిర్ణ
యించి దానికి హితము తెలుప వ్యాఘ్ర భల్లూక మత్తేభాదుల
నియమించి వాని యాజ్ఞ రీతిఁ దమరు సంచరింప నెంచెను. ఆ
మహాసభయం దధికారివర్గమున గోవు హరిణము మొదలగు
సాధుమృగములకుఁ జోటుదొరకదయ్యెను. అవియాస్థానముల
నాక్రమింపఁ బ్రయత్నింపఁ దలంపక యెందో యుండి బ్రదికి
నఁజాలుననియు నట్టి యధికారపిశాచావేశము తమకు వలదని
యు వదలుకొని, యేమూలలయందో యితరమృగధూర్తముల
కంటఁబడకయుండెను. వానికందుఁ జోటుండుట మేలని గజాదు
లూహించెనుగాని తుదకు లేకుంటయే మంచిదని నిర్ణయిం
చెను. అసాధుసంగతిని సాధుమతులు కోరరుకదా.

ఇట్లు వనవాసులగు మానవులు మృగములు తమతమ
యధికారమును స్థాపించుకొని ప్రభుత్వమున నేయన్యాయము
కలుగకయుండవలయు నన్నయూహచే వారి కాలోచనము
చెప్పుసభ్యులను గొందఱఁ బంపెను. కాని మృగరాజ్యమున
నాస్థానసభ్యులుగా వ్యాఘ్రాదులుచేరినందున సాధుజంతువులగు
గోహరిణప్రభృతులకు భీతి యించుకంతయు వదలక విశేషించి
జీవితమున ననుమానమే కలిగెను. అఱచేతం బ్రాణములం
బట్టుకొని భగవంతుఁడా మాయార్తిం బరికించువా రీలోకమున
లేరు. నీవొక్కఁడవే కలవని నమ్మియున్నారము. మాయం
దనుకంప యునిచి శీఘ్రంబ వీనిబాధకలుగకయుండఁ దొలఁ
గింపుమా యని ప్రార్థించుచునుండెను. పరాత్పరుఁడగుదా

నన్నింటిని గాంచువాఁడు కాని సర్వసాక్షియగుట వానికర్మము లెట్టివో వానికిం దగినఫలములు గలుగనుండ నడ్డుపడువాఁడు మాత్రము కాఁడు. కావున నూరకుండెను.

ఈ రాజ్యపదములు రెండును సుస్థితి నొందెనని యా యాయిప్రాణికోటి తలంచి యథాపూర్వవృత్తి నుండెను. కాని యీ వ్యవస్థవలన నించుకంతయు ధర్మముగాని సుఖముగాని వృద్ధినొంద దయ్యెను. తమతమ కడుపునకై మఱియొక యల్ప జంతువును జంపి తిని మిగిలినఁ బాఱవేయుటయు, దానిని మఱి కొన్ని తినుటయు నవియెల్లఁ బై వానికి సేవకులమని చెప్పుకొను టయు సాగుచుండెనే కాని న్యాయముగాని సుఖలేశము గాని కలుగకయుండెననుట నిక్కము. ఆటవికులును వేఁటాడి సాధు మృగములనే హింసించుచుఁ దమబంధువులకు సేవకులకు వాని నిచ్చుచు సంతుష్టినొందుచు వారు తమ్ము నాశ్రయించియుండ నదేమో గౌరవమని తలంచుచు నదియేసుఖమనియు నా సుఖమే శాశ్వత మనియుఁ దలంచుచుండిరి.

కొంతకాల మిట్లు గడువగా నాయరణ్యము మఱింత ప్రవేశింపరానిదై భయంకరమయ్యెను. నాల్గు దెసలనున్న మా నవులు దానింజూడను భయంపడుచుండిరి. అందు నేకార్యము నకై పోయిననుమహా క్రూరులుక్రూరజంతువులు తమ్మెం దోఁచుకొందురనియుఁ జంపుదురనియుఁ దలంచి యాతలంపులు గూడ మానియుండిరి. ఈ వార్త ప్రక్క దేశములయందును వ్యాపించెను. అందుఁ బ్రవేశింపరాదని నిర్ణయించుకొనుటె కాక యందలి మానవులు తమజనపదములపైఁ బడి యేమి యపకారము గావింతురో యని యడలుచుండిరి. కావుననే

వానిబాధ నడంచుకొనుటకుఁ దగిన యాయుధములఁ గూర్చు కొని భటులసిద్ధముచేసి రాత్రులయందు జాగరూకులై యుండిరి. స్త్రీబాలవృద్ధులు మఱింతభయంపడుచు నేయూరికిం బ్రయాణముచేయుటకూడ మానుకొని యున్నతావుననే యుండి కలిగినంతలోఁ దృప్తినొందియుండిరి. అట్టులాయరణ్యము గహనమనుపేరం బ్రఖ్యాతంబై యన్యాయ స్థానంబై యుండెను.

---

## రెండవ ప్రకరణము

---

### విహంగములు రాజ్యమును స్థాపించుకొనుట

కొలఁది దినముల కవ్వల విహంగములన్నియు నాలోచించి రాజును సభ్యులను నిర్ణయించుకొనవలయునని తీర్మానించుకొనియె. ముహూర్త మొక్కనాఁడు సకలవిధముల బాగున్న దని క్షీరవిహంగము (పాలపిట్ట) చెప్పెను. వాయసమది బాగుగనే యున్నదని శకునము చెప్పెను. గరుడపక్షియు దాని కంగీకరించినట్లు నటించెను. ఆదినమున నన్ని విహంగముల నొకచోటఁ జేర్పవలయునని యాలోచించి కంకగృధ్రాదులు చిలుకలం బిలిచి మీరొక్కక్క రొక్కొక్క దిక్కునకుం బోయి మాయూహలందెల్పి వారినెల్ల మాఘమాసమున మొదటి పక్షమున నేడవదినమున మంగళవారమున మూఁడవ యామమున ననంత గిరిశృంగముననున్న తొఱ్ఱమఱ్ఱిచెట్టు క్రిందికి రావలయుననియు నెవ్వరురాకుందురో వారెల్ల మరల నీయడవిఁ జరింపరాదనియుఁ దెల్పిరండు. పొండని యాన

చ్చిరి. ఆమహావిహగముల యానతిఁ దలఁదాల్చి శుకములా
తురమునం బరుగిడియాయడవినెల్లఁ దిరిగితిరిగి కొన్ని దినముల
కుఁ దమపని పూర్తిచేసికొని యావార్తను దమప్రభువుల పాద
మూలమున విన్నవించెను. అవి యన్నియు వ్యవహారమున
మానవులవలె నామములుండవలయునని తీర్మానించుకొనియెను.
ఇన్నిదినము లీచిలుకలు తిరిగినందులకు నాహారము వృక్షములే
యొసంగి తమగృహస్థువు ధర్మము నెఱవేర్చెను. పరోపకారము
నకు దృష్టాంతము వృక్షములేకదా. ఎట్లో యందందుఁ దిరిగి
యావార్త నెల్లరకు స్పష్ట మగునట్లు తమముద్దుపలుకులఁ
జాటెను. అన్నియునాలకించెను. ఇరువది దినములెడమున్నదిగాన
నప్పటికన్నిపనులు చక్కఁబెట్టుకొని యచ్చటికిం బోయి తమ
తమ విధులఁ దీర్ప నిశ్చయించుకొనెను. కంకగృధ్రాదులు
మరల శుకములం బిలిచి నియమితమగు నాకాలమునకు రాక
పోయినచోఁ గులమున వారిపేరు తొలఁగింతుమనియు సభా
భవనమున వారికి మర్యాదలేదనియుఁ దెల్పి రమ్మని పంపెను.
దేవుఁడాయని శుకములు పయనమై చని యొక్కొక్క తావునఁ
గొలఁది నిమేషములేయుండి విసుగులేక యవ్వలంబోవుచుఁదిరు
గుచుండెను. ఒక్కతావున మాత్రము క్షుద్బాధ మిక్కుటము
కాఁగా మఱియుఁ బ్రయాణముచేయఁ జాలక కూలఁబడెను.
ఆచెట్టుపైనున్న పక్షులన్నియు వానిం గాంచి కృపాపరతంత్ర
ములై తమ రందందుఁ దిరిగి తెచ్చిన యాహారమున నించుక
యర్పించెను. ఆ ఫలశకలములం దిని యెట్లో మాటలాడం
గల్గెను. కాని క్షుత్తు తొలఁగనందున నింక నాహారము కావ
లయునని తెల్పెను. ఆపక్షులు వాని యార్తింగాంచి పరితపించి

యెట్లో మిగిలియున్న తమ యాహారమున నించుక యీయఁ
గా దానిచేఁ గొంతశ్రమము తొలఁగఁగా నావృక్షముననే
యుండి సుఖముగా నిదురించెను.

మఱుదిన ముదయమునఁ బ్రయాణముచేయ నెంచెను
గాని యాహారతృప్తిగామి నించుక యాహారమును సంపాదిం
చుకొని పోయిన మేలని తలంచి క్షణకాల మందే నిల్చెను.
సూర్యోదయమయ్యెను. దిశలు వెలింగెను. ఆపక్షులన్నియు
వీని భావమూహించి యాచెంతనున్న వృక్షముల కడకుం
గొంపోయి చూపఁగా నాఫలములను నమలి యవి రుచ్యములు
గాకున్నను క్షున్నివారణార్థము కన్నులు మూసికొని తిని
శ్రమము వాయఁగాఁ బ్రయాణము సేయ నుద్యమించుచుండె
ను. ఆప్రాంతమున నొక సరోవరముగలదు. అది యాయడవిం
గల సరోవరముల యందెల్లఁ బెద్దదని ప్రసిద్ధి గాంచినది.
అందు సర్వదా జలముండును. కమలములు శృంగారముగాఁ
బూచియుండును. సలిలకుసుమము లెన్నియే నందుండును.
రేయింబవళ్ళు పరీక్షించిన నేవోకొన్ని పేరులుగల కుసుమ
ములు పూచియే యుండును. కాని పుష్పవిహీనముగా నా
సరస్సెకప్పుడు నుండదు. ఎవ్వరు నట్టిస్థితిలో దానిని జూచిన
వారులేరు. కావున నందు జలవిహంగమములు పెక్కువిధము
లుగాఁ గులములు నామములుగలవి సుఖనివాసము చేయుచుం
డును. వానికాహార విహారముల విషయమున నేచింతయు
లేదు. శత్రుభయముకూడ లేదు. విశేషించియగాధజలముండు
టయు శైవాలములు దట్టముగా నందుఁ గనఁబడుటయు నా
సరోవరమధ్యభాగమునఁ గమలాదులుండుటయు వాని నాశ్ర

యించి జలవిహంగమము లుండుటయుఁ గారణముగా శత్రు భయము వానికింగలుగదయ్యె ననిపాఠకు లూహింతురుగాక. ఆటవికులు దిగఁజాలరా యన్న నందు గ్రాహములు(మొసళ్లు) విశేషించి కలవను నొక కింవదంతి కలదు. దానికి భయంపడి యెవ్వరునందుఁ దిగిన పాపమునఁ బోలేదు. పక్షివ్రాతమున కాసరోవరనివాసములే హాయిగా నుండెనని యాకాలమువా రూహించిరి.

చిలుకలు పయనము చేయునప్పుడు మఱొక్క పర్యా యము కార్యప్రకార మిదియని పలికెను. అందొక్క శిశు పోషక మాశుకములతో విహంగమములనఁగా నన్నియు నని యర్థమా కొన్నియని యర్థమా యని ప్రశ్నించెను. మీప్రశ్నము మాకుఁ జక్కగాఁ దెలియ లేదని శుకములు బదులిడెను. విహంగమములన్న నర్థమేమి? అని మరల నీలాం గము ప్రశ్నించెను. విహంగమములనఁగాఁ బక్షులని యర్థమని ఫలభక్షకములు బదులిడెను. స్థలజలవిహంగములని పక్షిజా తులు రెండు తెగలుగఁ గలవు. అం దిపు డేవి రాఁ దగినవని మరల నాశిశుపోషకము బ్రశ్నించెను. ఈ భేదమును బయలు పెట్టుట మనకులమునకే మంచిది కాదనియు, మఱియు నైక మత్యము చెడుననియు, దాని నితరమృగజాతులు మనల గౌరవింపక దూషించుననియుఁ జిలుకలు పలికెను. మృగములు నవ్వునని కులగౌరవమును బోఁ గొట్టుకొందమా. అదియెంత కాలమునుండియో వచ్చుచున్నది కదా. దానిఁ దొలుదొలు తఁ జూచుకొనవలదాయని మరల నల్లపిట్ట ప్రశ్నించెను. ఇం దే జాతి యుత్తమమని నీభావమని చిలుకయడిగెను. లోకవిదితము

గానున్న విషయమున జంకుపడనేల? స్థలపక్షు లుత్తమములని
యు జలపక్షులు నీచములనియు నంద అంగీకరించిరని పితృప
క్షి సమాధాన మిచ్చెను. ఆమాటలకు నవ్వి చిలుకలిట్లు పలి
కెను. నీకు దృష్టి పటుత్వము తక్కువగానున్నది. అట్లే మనో
బలము కూడఁ దక్కువ యని తలంతుము. చెట్లపైనుండు పక్షు
లును నీళ్ళయందుండు పక్షులు నొక్కజాతివే. ఈ రెండు
స్థలములనుండు పక్షులు కొన్ని కలవు. కావుననే పక్షిజాతులు
మూఁడు తెగలు. ఇందొక్కవంశము శ్రేష్ఠమని యొక్కటిమధ్య
మమని వేఱొకటి నీచమని భావింపరాదు. చుట్టఱిక మన్నిం
టికిఁ గలదు. ఈపక్షులకెల్ల గరుత్మంతుఁడు ప్రభువని విను
చున్నాము. కాని యాపక్షి రాజును మన మెఱుంగము. ఆపక్షి
రాజు మహానుభావుఁడఁట. ఆయనకు బదులుగా నొక్కనిరాజు
చేసి యాతనికొక్క సింహాసన మేర్పఱచి మంత్రులను గొంద
ఱ నేర్పాటుచేసి మఱికొందఱను వారి పాలనమును బరీక్షిం
చుచు వారికిం గావలసినపుడు ఆలోచనలు చెప్పుచుండు పెద్దల
ను నియమించిమన పక్షి రాజ్యమును స్థాపింపవలయునని యిపుడు
చేయుప్రయత్నము. ఈప్రయత్నము పక్షిరాజగు గరుత్మంతు
నకు సాయముచేయుటకే గాని యాయనను దిరస్కరించి యిం
కొక్కని రాజుగాఁ జేయుటకుం గాదు. ఆగరుడునకు ననేక
కార్యములు కలవు. విష్ణుమూర్తి యెదుట నుండవలయు. అదే
ముఖ్యకార్యము. ఆయన యుత్తరవు చొప్పున యుద్ధములు
కలిగినపుడు పోయి వానిని వారింపవలయును. భక్తులు పిలిచి
నపుడు వారిని మోసికొని పోవుచుండవలయు. ఒక్కక్షణ మై
నను గరుడునకు అవకాశము లేదు. కావున నామహారాజునకు

సహాయముగా సింహాసనమునుండి రాజ్యమును బాలించుచు
గొప్పకార్యములు గలిగినపుడు వారికిఁ దెలుపుచు వారి యా
జ్ఞానుసారము నడపుచుండవలయు ననియే యిప్పుడు చేయుపని.
ఇది మహాకార్యము. దీనికి ముందే యిట్టిభేదములు గలిగించిన
బనిచక్కఁగా సాగదు. కాఁబట్టి యాప్రశ్నమును మాని
యైకమత్యము గలిగి పని నిర్వహింపవలయును.

అని చిలుకలు పలికిన విని శిశుపోషకమాగ్రహమున
దేహము తెలియక కన్నులెఱ్ఱపడఁగా గట్టిగా నిట్లుపలికెను.
చిలుకలారా! మీకుఁ దెలివి మిక్కిలి తక్కువ. ఆలోచించు
శక్తిలేదు. దూరాలోచనమనునది మీకుఁ దెలియనే తెలియ
దు. కావుననే మర్యాదయెఱుంగక మాటలాడుచున్నారు. స్థల
పక్షులనఁగా నీదేశముననే పుట్టి యిందే పెరిగి యిందే జీవించు
చుఁ దుదకు ప్రాణములనైతమిందే వదలునవి. నీటిపక్షులట్లు
గాదు. ఏదేశమునుండియో వచ్చి యిందు నీరు ద్రావి వలసిన
యాహారమును దినుచు హాయిగానుండి కొంతకాలమునకు దే
హబలమురాఁగా నిందున్న పదార్థములం దీసికొని తమ దేశము
నకుఁ బోవునవి. కావునవానితోడ మనము కలిసియుండరాదు.
దానిచే మనకు మేలుచేకూరదు. కనుక నీటిపక్షులను దోలఁ
గఁదీసి స్థలపక్షులమగు మనమెల్ల నొక్కచోటం జేరి మన
లో నొక్కపక్షిని రాజుగాఁ జేసి మఱికొన్నింటిని మంత్రులను
గా నేర్పాటుచేసి బాగుగా లోకజ్ఞానము గలపక్షులను బెద్దలను
గా నియమించి వారియాలోచనమును గైకొనుచు రాజ్యమును
బాలించునట్లుచేసికొనిన మనదేశమునకు మేలుగాని పరదేశ
మునుండి కార్యముకొఱకు వచ్చిన జలపక్షులను జేర్చికొనిన

నవి మనలో మనకు స్నేహము చెడునట్లు చేసి విశేషించి కలహములు పుట్టించి తమకార్యమును దీర్చుకొనిపోవును. మనగతి యెప్పటికి నిట్లే యుండును. కావున నామాటవిని యీ యాలోచనము నేను జెప్పినట్లు కంకగృధ్రాదులకుం దెల్పి కార్యము చక్కపెట్టుము. లేకపోయిన రాజ్యమును జక్కఁగా సాగకయుండఁజేసెదను. నేనొక్కతనే యనుకొంటివేమో. నాబలగముచాలఁగలదు. అందందు నాకు మిత్రులు గలరు. నామాటయన్న వారెల్ల శిరసా వహింతురు. అప్పుడు మీప్రయత్నమును దాఱుమాఱుచేయుదును. అందువలన వానిని బిలువక పోవలయునని యొత్తిపలికెను.

చిలుకలు కొంతదూరము పైనఁ జూచుచు నాలోచించి యిట్లు పలికెను. ఓ శిశుపోషకమా! త్వరపడక మామాటలాలకింపుము. చోటుమాఱినంత మాత్రమున జాతిమాఱదు. అవియు మనము నొక్కజాతికిఁ జేరినవారము. ఒక్కతావున నందఱమున్న నాహారము చోటుచాలదని యాయాచోటులఁ జేరి బ్రదుకుచున్నాము. అన్ని జాతులకు గరుడుం డొక్కఁడే ప్రభువు. ఆయనకు మనమెల్ల భృత్యులము. మనయందఱియందు నామహానుభావునకుఁ గరుణసమానము. మనలో నెవ్వరికాపదలు గలిగినను దీర్చువాఁడాతఁడే. ఇట్టులుండఁగాఁగొన్ని పర దేశమునుండి వచ్చినవని అందువలన నవి నీచములని మనమిందే యున్నవారమని. కావున మనమధికులమని తలంచుట బుద్ధిలోపము. విద్యాలోపము-అంతియగాక లోకజ్ఞానలోపము. అంతియకాని వేఱుగాదు. మనమానీటిపక్షులవలన నెన్నియోవిషయముల నేర్చుకొంటిమి. నేర్చుకొనుచున్నాము. నేర్చుకొనఁ

గలము. నేర్చుకొనఁబోవుదము. ఇంతటియుపకారము మనకు నొనరించిన యాపక్షులను వేఱుచేయుట న్యాయముగాదు మేలుమఱచినట్లగును. దానమనయభివృద్ధికి భంగము - పోనీ యొక్కమాటకు బదులుచెప్పుము. ఆసరస్సున జలపక్షులున్న వి. అందుహంసలున్నవి. వానిలో ననేకజాతులు గలవు. మఱి యు నింకను వేఱు వేఱు జాతులుగల నీటిపక్షులు గలవు-కొల్లు గలవు. బెగ్గురుపక్షులు గలవు. వానిలో దేని మూలముననైనమన కపకారము గల్గినదా? హంసలనుగాంచి వాని హితబోధమును విని మనమెన్నియో విషయములగ్రహించితిమి. తుదకు నడ కనేర్చుకొనఁ బ్రయత్నించుచున్నాము. వానివంటి వృత్తినేర్చు కొనఁ దలఁచుచున్నాము. వానియాలోచనలు నిర్మలములు. వానియాహారములు పరిశుద్ధములు. వానినడక మెచ్చఁదగినది వానిబుద్ధిసూక్ష్మము. ఏవిషయమునుగాని యొక్కక్షణమున గ్రహించును. అడిగినవారికివిద్యయు బుద్ధియుఁ గలుగఁజే యును. అట్టి వానితో సహవాసము మంచిది కాదనుట న్యా యమా. ఇంతకాలమునుండి వానితో సహవాసము చేసి యె న్నియో విషయములు నేర్చుకొని రవంత తెలివిరాఁగా వాని ని దఱుముటకుఁ బ్రయత్నముచేయుట న్యాయముకాదు. మేలుకూడ దానఁగలుగదు. మనకంటె వానికిఁ దెలివి తేట లెక్కువగాఁ గలవని వానిదఱిమివైచిన మనకు విశేషజ్ఞానము నేర్పువా రెవరు? అదిలేకయున్న మనకభివృద్ధి యెట్లగును? చక్కఁగా నాలోచించి బదులుచెప్పుము. త్వరపడకుము. దూ రముగ దృష్టిని బఱపుము. అని పలుకఁగా విని మఱింతమండి పడి యాశిశుపోషక మిట్లనియె.

శుకములారా ! మీకు బుద్ధి చాలతక్కువ. ఫలముల నమలినమలి బుద్ధిచెడినది. మావలెనే రుచిగలమాంసము నుచ్ఛిష్టమును దినఁ బ్రయత్నించిన బుద్ధి బాగుగాఁ గుదురును. విద్యాబుద్ధులు మనకన్న హంసల కధికముగాఁ గలదంటిరికదా. ఎంతటిమాట వింటిని. వాని నడక మంచిదంటిరి. నకడలో నాకవి సమానమా. ఏనాఁటికిని గావు. గానమున నాతో నెవ్వరు సమానులు. మీకు నాలుగుమాటలు వచ్చునని గర్వపడియెదరా. లోకజ్ఞానమున మన పూర్వులు లోకమునఁ గలపక్షులలో గొప్పవని యంద అంగీకరించిరి. శవములను క్షణమాత్రమునఁ దిని లోకమున కుపకారము చేయును. మానవులు వానింజూచి భయంపడుదురు. కాబట్టియే మాజోలికి రాకున్నవారు. లేకున్న వేఁటాడిమమ్ముం జంపకుందురా. సౌందర్యమునఁ గొంగలకు సమానములు గలవా. వానిపాదములు చూచిన నెంతబాగుండునో యెఱుంగరా. దానిమెడ సొగసొక్కటి చాలదా. దేవుఁ డంతవాఁడు మూర్ఛపోయె నని మాతాత చెప్పఁగా వింటిని. ఇంక నుదాహరణములుగాఁ జెప్పఁదగినవి పెక్కులు గలవు. వానినెల్ల వర్ణింప నిది సమయముగాదు గాని లేకున్న నొక్కసంవత్సరము చెప్పినమాట మరలఁ జెప్పకుండఁ జెప్పనా నేత్రసౌందర్యము నాకు మిక్కిలి గలదని నిన్న గూడ నొక్కనక్క వర్ణించెను. నానడకను జూచి మూర్ఛపోవుదునని యొంటె యీదిన ముదయముననే పల్కెను. నామాట యబద్ధమేమో యీపక్షుల నడుగుము ఎందఱో కొన్ని వేళల నాజాతినాశ్రయించి యన్నముపెట్టి నమస్కరించి పోవుచుందురు. మానవులు నందు బ్రాహ్మణులు మొదలగు నా

ల్లుజాతులు మాజాతిని బూజించి యన్నము పెట్టినఁగాని ముక్తి లేదని పెద్దలు సంతుష్టి నొందరని యనుకొనుచున్నారనియు నామాట నిశ్చయమే యనియు నాలుగుదినముల నాఁడు మహాసభలో గాడిదెయొండ్రపెట్టుచు బొంగడెను. ఆధ్వనికి పక్షుల పిల్లలు బెదరి క్రిందఁ బడియెను. నామాట నేను జెప్పకొనఁ గూడదుగాని యనేకవిషయములలో హంసలు నాతోఁ బోటీ చేయఁజాలవు. నమ్ముము. మఱొక్కమాట. ఈసమయము మంచిది. ఇప్పుడే వీని నడంచినఁ దలయెత్తఁజాలక తమదేశము నకుం బోవును. మనము హాయిగా రాజ్యమేలుదుము. మీకెవ్వరో బుద్ధి చెఱచినారు. కావుననే పరదేశపక్షులం బొగడుచున్నావు. నామాట యటుండనీ గాని పిచ్చుకవలె హంస నడువఁగలదా. అది నడుచుచున్నను, ఎగురుచున్న నెంతబాగుండును? నృత్యము చేసినట్లుండునే. మీకన్నులకు రోగము కలిగినదా. చూచుచుం గూడ హంసగమనమును బొగడుటేల? అని యింక నేమో చెప్పఁబోఁగా నా నీలాంగమును వారించి శుకము లిట్లు పలికెను.

ఓసీ వెఱ్ఱి శిశురక్షకమా! ఎంతయవివేకము నీకుఁ గలదు? హంసయెక్కడ? నీవెక్కడ? ఏవిషయమున సామ్యము కలదు? గమనమున నీకది సమానముకాదా. క్రొత్తమాట వింటిమి. ఇంక నోరుమూసికొనుము. నేత్రసౌందర్యము కూడ నీకుం గలదా. ఎంతటిభ్రాంతి నొందితివి? నిన్నఁ గొన్నిపొగడెనా? ఇది మఱింత బాగున్నది. ఇంక నోరెత్తి మాటాడకుము. పిగ్గునీకు లేదు కాని మాకుఁ గలుగుచున్నది. నీకు సంగీతమునఁ బాండిత్యము కూడఁ గలదా. వహవా! మెచ్చవచ్చు

ను. నీతోమాటలాడుటకంటె నూరకుండుటయే మేలు. ఇంక
నీప్రతాపము నందఱితోఁ జెప్పెదు మని ప్రయాణము చేయఁ
బోవ నానీలాంగము మహత్తరక్రోధమున వానిపైఁబడి పొడువఁ
బోయెను. అత్తఱినందున్నయొకగ్రద్దగుబేలునదానిపై వ్రాలి
ముక్కునం బొడిచెను. దానగర్వశాంతికాఁగా నూరకుండెను.
చిలుకలు దానిని శాంతింపఁ జేసి నీలాంగమునకు బుద్ధిచెప్పి
పోయివత్తుము. ఈకోపము మదినుంచకుము. దూరదృష్టిం బరి
కింపుము. మనలో నైకమత్యము ప్రధానము. అది కుదురక
యున్న నేకార్యములు కాఁజాలవు. కావున శాంతమూని మీ
మిత్రములం గూడి యాశుభముహూర్తమునకు రావలయునని
బోధించి పయనము సాగించెను-శిశుపోషక మప్పు డేమియుఁ
జేయఁజాలక యూరకుండి మనస్సున నాపగ నాటుకొనఁగాఁ
గార్యంబుతటిఁ జూపవలయునని తలంచుచుఁ దనజాతి పక్షులం
గూర్చుకొని యొక్కనాఁ డీవిషయ మంతయుఁ దెల్పి తనపట్టు
దలను గెలుపొందఁ జేయవలయునని తీర్మానించుకొనియెను.

ఆమ్రాను వదలి ఫలభక్షకములు సరోవరము కడకుం
బోయి యాతీరమున నున్న బలుసుచెట్టు కొమ్మపై వ్రాలి
యిట్లు పలికెను- జలవిహంగమములారా! ఈయటవిం గల
మానవులు మృగములు తమతమ రాజ్యమును స్థిరపఱచుకొని
సుఖముగాఁ గాలముం బుచ్చుచున్నవి-గరుడుని యంతవాఁడు
మనకుఁ బ్రభువుగానుండియు నామహామహుఁడు కార్యాంతర
ముల మునింగి యుండుట మనప్రభుత్వము సాగకున్నది-కాన
దానికిగాఁ గంకగృధ్రాదులాలోచించిమాఘశుక్లసప్తమీమం
గళవారము మూడవజామున ననంతపర్వతశృంగముననుండు

తోఱ్ఱమఱ్ఱిచెట్టుక్రింద సభచేరవలయునని తీర్మానించి మమ్ముఁ
బంపఁగా వచ్చితిమి- మీరందఱు తప్పకవచ్చి రాజమంత్రుల
ను సభ్యులను నిర్ణయించి మనకులగౌరవమును నిలుపవలయు
ను- అని పలుకఁగా విని సరస్సునఁ గల పక్షులన్నియుఁ గలి
యంబలికికొని తమపక్షమున మాటలాడుమన నొక్క కల
హంస యిట్లు పలికెను- శుకవర్యములారా! మీప్రయత్నము
చాలామంచిది. కులగౌరవమును గాపాడఁ బ్రయత్నించి యా
కార్యమును జక్కఁజేయ మార్గశ్రమములం దలంపక యింత
దూరము వచ్చితిరి- స్వకార్యముల వదలితిరి- ఇంతకంటెఁ
బాటుపడువా రెవ్వరు? ఇట్టి మీయాహ్వానము వృథచేయ
ము- ఎన్ని కార్యములున్న వదలి కాలముతప్పక వత్తుము-
మీయాతిథ్యమును గైకొనుఁడు- అనిపలికి మృణాళములు
(తామరతూడులు) కొన్నియిచ్చిమచ్చికమీఱఁ బంపెను-వా
నియాదరణమునకుఁ బ్రియసంభాషణములకు మిక్కిలి సంత
సంబంది తమలో నొకరితో నొకరు చూచితిరా! స్థలపక్షులకు
జలపక్షులకుం గల భేదము- శిశుపోషక మెంతమోఱకుఁ
దనమున మాటలాడెనో-హంసయెంతమృదుమధురముగా సం
భాషించెనో తేటపడియెఁ గదా-స్థలవాసులమను నభిమానము
తప్ప నించుకంతయుఁ దెలివితేటలు గలవా- ఇట్టిమూర్ఖులు
సభనలంకరించినను దాని మర్యాదకు భంగమే కలుగును
గదా - అనుకొనుచు హంసాదిజలపక్షులవలన సెలవంది
వేఱొకచోటికిం బోయెను.



# మూఁడవ ప్రకరణము.



ఒక్క తావునఁ గొన్ని పక్షులు జువ్విచెట్టుపైఁ గులాయములు (గూండ్లు) కట్టుకొని హాయిగా నుండెను. వాని యన్నింటిలోఁ బావురము చాలఁబెద్దపక్షి. కావున నావృక్షమున నది పారావత రాజను నామమున నుండెను. ఆతనిమాటచొప్పున నందలి యితరపక్షులన్నియుఁ బ్రవర్తించుచుండును. ఈశుకములావృక్షముదాపునకుం బోయి మేము రాజుదూతలము. రావచ్చునే యని యడుగ నొకపిచ్చుక ప్రభువు నాజ్ఞనొందని దేరాఁగూడదు. మనవి చేసి చెప్పెదను. దూరమున నుండుఁడనిపలికి పోయెను. శుకములు త్రోవబడలికలఁ గుందుచు నొక కంపచెట్టుమీఁదఁ గూరుచుండిరాజాజ్ఞకై కాచియుండెను. ఒక్కజాము గడచెను. బదులులేదు. రెండవజాము మెల్లగా సాగెను. అప్పుడును బిలుపులేదు. మూఁడవజామునఁ గొంతగడచెను. విసిగివిసిగి కంపచెట్టుపైఁ గూరుచుండఁజాలక దైవమా యేమిగ్రహచారమును దెచ్చిపెట్టితివని పరితపించుచు లేచి యాచెట్టుచెంతకుంబోయి రావచ్చునా యని ప్రశ్నించెను. అప్పటికిఁక రావచ్చును, రాజాజ్ఞయైనదని ప్రతిశబ్దము వచ్చెను. బ్రదికితిమిరా స్వామీయని యాశుకము లాచెట్టుకొమ్మపై వ్రాలెను. అంతకుముందే పారావతరాజునకుఁ బీఠమమర్పఁబడియుండెను. తృణమయసింహాసనమున నారాజు కూరుచుండియుండెను. చెంతనే కలవింకములు పెక్కు కూరుచుండియుండెను. రాజునకెదురఁ బ్రాఁతపుల్లలచే నమర్పఁబడినయాసనముల శుకములన్నియుఁ గూరుచుండెను. పావురమానతీయఁగా నొకకలవింకము వచ్చినకారణ

మేమి ? ఏలినవారి యోలగమున విన్నవింపఁదగు విషయమే
ది ? త్వరగా మనవి చేయువలయు. కార్యాంతరము లనేకము
లుండును. యాచకు లెందఱో వచ్చి కాచుకొని యుందురు.
వ్యవహారములెన్నియో పరిష్కరింపవలసి యుండును. కావున
వైళంబ విన్నవింప వచ్చునని పలికెను. పంచెవన్నె చిలుక లేచి
యిట్లు పలికెను. పక్షిరాజ్యము నీమహారణ్యమున స్థాపింపఁగంక
గృధ్రములు ప్రయత్నించి మాఘశుక్లసప్తమీ మంగళవార
మున మూఁడవజామున ననంతగిరి శృంగమునఁ దొఱ్ఱమఱ్ఱిక్రిం
ద సభచేరవలయుననియు నందుఁజేరి మనమెల్ల నొక్కనిరాజు
గానిర్ణయింపవలయు.మంత్రులనుసభ్యులను నియమింపవలయు.
ఈకార్యములెల్ల నందుఁగావలయును. మీరెల్ల రాసభకుదయ
చేయవలయును. మిమ్మాహ్వానించుటకే వచ్చినవారము. పిమ్మట
దేవరయాజ్ఞ మేఱకుఁబ్రవర్తింతుమనివిన్నవించియూరకుండెను.

ఆమాటలు విని పావురము తనరాజత్వమచ్చుపడఁగా
మంత్రికలవింకమును జూచి మామాటలుగా శుకముతోఁ జె
ప్పుమని యిట్లు వాక్రుచ్చెను. మేమింతకుముందే రాజ్యమును
స్థాపించితిమి. సువ్యవస్థగా సాగుచున్నది- మంత్రి సేనాపతులు
లోనగు నుద్యోగులందఱు శక్తివంచనసేయక పాటుపడుచున్న
వారు. ఇపుడు స్థాపించు రాజ్యము మాక్రింద నుండుట మేలు.
వేఱుగ రాజ్యమును స్థాపించిన మాతోటి కలహమగును. మీ
వారి కీమాయాజ్ఞనుదెల్పుఁడు. మా యానతి శిరసావహించిన
చో మేలయ్యెడు. కాదేని కాలము చూచుకొందము. అనిపలి
కిన మంత్రియు వానితోటి మఱికొన్నింటినిజేర్చి రాజునాశయ
ములఁ దెల్పెను. ఆయవివేక ప్రసంగముల నాలకించి యాఘల

భక్షకములు రాజా! మాకుఁ జెప్పిన పనిని దెల్పితిమి-రాజ్యమును స్థాపించునధికారము మాకులేదు- ఆవిషయము సభలో దేలును- మీరచ్చటఁ జర్చింపవచ్చును- దూతలమగుమాతో నా చర్చయేల ? మాపని నిర్వహించితిమి-సెలవయ్యే నేనరుగుదుము- అనిపలుక మోము చిట్లించుకొనుచు నాపారావతము చిలుకలారా ! మీకు యుక్తాయుక్తపరిజ్ఞానములేదు-మాయానతి మీ యధికారులకుం దెల్పుఁడు- అంతియకాని మఱి యొకమాట చెప్పనధికారము మీకులేదు- మాపాదసేవకుల యాజ్ఞానుసారము మెలఁగవలయును- మాయానతి విన్నవించి యందులకు వారేమందురో తెలియఁజేసి పొండు - అనిరాజు పలుక నామాటలవివేకమూలములుగా నుండఁగా విననోపక యిట్లు బదులుచెప్పెను-మీయుత్తరువు కొనిపోయి మాయధికారులకు విన్నవించి వారేమందురో యావార్తను దెచ్చి మీకుఁదెల్పుట మాపనికాదు- మేము వనభాగమెల్లం దిరిగి యందుఁగలపక్షులఁ బిలుచుట కాజ్ఞాపింపఁబడితిమి- తిరుగవలసినతావులు పెక్కులు గలవు-ఆలసించిన వారి కాగ్రహము గల్గించినవారమగుదుము- మార్గాయాసమునఁ గడుబడలి యున్నారము- ఆహారమే యీచోట దొరకుట కలవయ్యెను- ముందునడువఁ గలమను నాశయులేదు- కావున మరలి రాఁ జాలము. మాయధికారులు సమ్మతింపరు.

అని మానవవాక్కులుగల శుకములుపలుకుచుండునంతలో రాజు కనుసన్న మెఱింగి కలవింకములు లోనగుపక్షులుకోపంబు రూపంబు దాల్చినపగిదిఁ గిచకిచలాడుచు వానిపైఁబడి పొడువనారంభించెను- వాని యప్పటి దుష్కృత్యమునకు నలి

గియు ధైర్యము పెంపున శాంతమూని యాచిలుకలు పక్షులా
రా ! రాజా ! ఇదితగునా- దూతలమగు మమ్ము దండింపఁజ
నునా- మీరాజ్యమున నిట్టి యక్రమములు సాగునేని త్వరగా
నదినశించుఁగాక- కానిండు- మీయక్రమమును విచారిం
చువారు కలరని నమ్ముఁడు- ఇంచుకంతయుఁ దప్పులేనిమమ్ము
దండించితిరి- మీపాలనము నశించుఁగాక- మీగతిముందుఁ దె
లియవచ్చును- మీకిఁకఁ బక్షికూటమున గౌరవమునశించునని
నమ్ముఁడు-మేము మిమ్ముఁ బాడువశక్తిగలవారమయ్యు నది
మంచిదిగాదని యూరకున్నారము- కావున మేమిఁక వెళ్ళెదు
ము- అని బుఱ్ఱునలేచి యెగిరిపోయి వేఱొక్కచెట్టుమీఁద వ్రా
లెను- అందుమయూరములుండి వానికిస్వాగతమొసంగెను.
చిలుకల బడలికలంగాంచి యాతురంపడి వాని కాహారమును
సమకూర్చెను- కాని యాయాహారము వానికి సరిపడనందుననీ
వారధాన్యముఁ జూపిన మహానందమున నాతెండు లములందిని
చేరువనున్న చెట్టునఁగల ఫలరసమును ద్రావిబడలికలుడుగ
హాయిగామరల నెమిళ్ళచెంతఁ గూరుచుండెను- కుశలప్రశ్నము
యథావకాశముగా మరలఁ గావింపఁబడియెను- చిలుకలును
దమరాకయునందందుజరగిన సంభాషణము, ఒక్కచోఁదమకు
గలిగినపరాభవమును దెల్పి యంగలార్చెను. మయూరములా
పారావతము పొగరుపోతుతనమున కెంతయుఁ జంతించి యంద
లికలవింకముల దుశ్చరిత్రమును దమరంతకు మున్నే విన్నవా
రు గావున నవి యున్న చోటికి సాధువులగు మీరు పోఁదగదు.
తెలియకపోయితిరి. మీరాక మాకును దెలియదు. ఇపుడు
మీఱినపని కూరక విచారించిన లాభములేదు. ఆమహాసభ

లో నీవృత్తాంతమును వెలిఁ బుచ్చి తగిన ప్రాయశ్చిత్తము వానికిం గావించి వేఱొకపని చూడవలయును. అని యనేక ప్రకారముల నూఱడించి యవశ్యము మేమాసభ కరుదెంతు మని యభిప్రాయము తెలిపెను. సాయంకాలమైనందున నామ హీరుహామునందే యామయూరముల సంగతి నాఫలభక్షములు శయనించెను. ఇష్టకథాలాపములను గాఢనిద్రచేతను రాత్రిఁబుచ్చెను.

---

## నాల్గవ ప్రకరణము.

### పారావత సందేశము

అనూరుఁడు వికలాంగుఁడు- ఆతనిపని సారథ్యము. రథ మరుగుమార్గ మాకాశము. ఘంటాపథమందుండ వీలులేదు. రథికుఁడో యగ్నిగోళములం బడుసూర్యుఁడు. ఇందేదియుఁ గార్యసాధనమునకుఁ బనికివచ్చునది లేదు. కావున దేవుని యాజ్ఞానుసార మాబండి యరుగుచునే యున్నది. ఒక్కదిన మైనను శిథిలమయ్యె ననికాని యలసెననికాని విశ్రాంతి గోరుచున్నదనికాని వినఁబడలేదు. మొదటినుండి యొక్కరీతిగా నా బండి ప్రయాణముచేయుచున్నది. ఏల? ఈశ్వరుని యనుగ్రహము. అదిలేనిచో నెన్నిసహాయము లుండినను గార్యము నెఱవేఱదు. ఏసహాయము లేకున్న నదియుండిన నెఱవేఱును. దానిని నమ్మక యున్నవారినే పామరులని పెద్దలు వాడుదురు. మనుష్యబలమున్నఁ జాలునని కొందఱల్పులు తమ పౌరుషము చూపి కార్యము సాధింతుమని ప్రల్లదములు పలుకుదురు. వారి

మాటప్రకార మొకప్పుడు కార్యము నెఱవేఱును. ఇంకొక
ప్పుడది విఫలమగును. నెఱవేఱినపుడు మీసము దువ్వుదురు.
నెఱవేఱనపుడు విలపింతురు. అంతియ కాని మనప్రయత్నము
నకు దైవముతోడైనఁగాని కార్యము ఫలింపదన్న జ్ఞానము
గల్గి దైవమే ప్రబలమని వారూహింపరు. కావుననే మూర్ఖులని
వారికిఁ బేరుకల్గెను. వారు తమబలమెఱుంగక జ్ఞానశూన్యులై
సాధువుల కపకారము చేయఁ బూనుదురు. ఏలయనఁగా
సాధువులకుం గల్గుఖ్యాతి తమకు లేదనియు దానినడంచినఁ
దమకది కల్గుననియు వారిభావము. అట్టి యవివేకులసంగతి
సుజనులు వదలవలయును. వదలకున్న వారికి మఱింత ఖ్యాతి
గల్గించినవారగుదురు.

ప్రాతఃకాలము మనోహరమైనది. అట్టికాలమింకొకటి
యుండుననుటకల్ల. దానికదియేసాటి. అక్కాలముననేబుద్ధియొ
క్క తావున నిల్చి యేకార్యము చేయవలయునా యని యా
లోచించును. ఆకాలముననే బుద్ధి సుస్థిరతం గాంచును. యో
గము నభ్యసించుట కిదియే ప్రధానకాలము. వైద్యులప్పుడే
రోగికి నాడీ పరీక్షచేయుదురు. రోగస్వరూపమపుడు బాగుగాఁ
దెలియును. నరము లాహారమునఁ గల సారమున సుస్థితియం
దుండును. ఒక్కసారి ప్రపంచమువైపు దృష్టులం ద్రిప్పినచో
నెంతయో సంతోషము గలుగును. కమలాకరములంగాంచిన
నపుడే తమ మృదుపత్రములవిప్పి తామరలు పుష్పించుచుం
డును. అందుండి సువాసనలు గుబులుకొను చుండును- దాని
నాస్వాదింప వాయుకిశోరము లాసపడుచుండును- తుమ్మెదలా
పూలపైఁ దిరుగుచు సందలి పూఁదేనెం ద్రాగఁగోరి ఝుంకార

ములనెల్ల తుమ్మెదలం బిల్చుచుండును- మానవులకుఁ గలిగి
నంతయాశ వానికిలేదు- ఒక్కపదార్థమును జెక్కురుగూడి
యాస్వాదింప నవి కోరును- మానవు లితరులకంటెఁ బడక
యుండ దానిం గైకొనఁ బ్రయత్నింతురు- ఇట్టి మానవులకం
టెఁ గీటకములుకూడ శ్రేష్ఠములేకదా- తుచ్ఛులగు మానవు
లు తమరు శాశ్వతముగ నుందుమనుకొని సకలపదార్థముల
సంగ్రహింపఁ బూనుదురు- ఎల్లరకంటె మిన్నగా నుండవలయు
నని కోరుదురు. అట్లు కోరిన నది రాదు- తనంత భగవదను
గ్రహమున నది రావలయును- ఇంతమాత్రము జ్ఞానముకూడ
నీచమానవులకు నుండదు- ఏమి వారి క్రూరకర్మము.

అట్టి ప్రాతఃకాలమున నెల్లప్రాణులు సుఖముగా నుం
డఁ బ్రయత్నించి దానికిం దగిన ప్రయత్నములఁ జేయఁబూ
నును. ఆమహారణ్యమునఁ గల పక్షులన్నియుఁ దమతమ శిశు
వులకు నాహారము సంపాదించు నిచ్ఛలఁ బయనముచేయ
నుంకించుచుండెను - ఇంతలో నొకకలవింకమాయడవిం గల
సరస్సున కరుదెంచి హాయిగా జలతరంగములను నుయ్యేలలం
గూరుచుండి యూఁగుచుఁ దమప్రియురాండ్రతో జిలిబిలి పలు
కులు పలుకుచుండు మరాళములం గని యిట్లు పలికెను. మర
రాళాదిపక్షులారా! మాపారావత రాజేంద్రు నానతి నాలకిం
పుఁడు. "ఈ రాజ్యమునకు మేమధిపతులమై పాలించుచున్న
వారము. మాయేలుబడికి లోఁబడిన మీరెల్ల మాయానతి
శిరసావహింపవలయుఁ గదా. ఇంతదనుక నట్లే మీరుంటిరి.
ఇపుడట్లే యుండవలయును. నిన్న మొన్న నొకవింతవార్త
వింటిమి. కంకగృధ్రాదులు కలిసి యీరాజ్యమును బాలింప

రాజు నేర్పఱుపఁ దలంచినట్లు, అందులకు నొకసుముహూర్తము నిర్ణయించునట్లు, వనమునం గలపక్షుల నెల్లఁ బిలిచి రమ్మని చిలుకల కానతియిచ్చి పంపినట్లు విని యచ్చెరువందితిమి. ఆదుర్వార్తఁ దెలుపవచ్చిన యాచిలుకలకుఁ దగిన ప్రాయశ్చిత్తము దేహశుద్ధి రూపమునఁ జేసి పంపితిమి. మీరెల్లరు వానిమాటలనాలకించి యాదినమున కచ్చటికిం బోవుదురేమో. జాగ్రత్తగనుండుఁడు. మాయజ్ఞానుసారము మెలఁగుఁడు. హద్దుమీఱిపోయితిరేని మాయాగ్రహమునకుఁ బాత్రులుకాక తప్పదు. ఇది మాయేని యానతి." అనిపలికి యిందుల కేమి బదులిత్తు రని ప్రశ్నించెను.

మరాళము లామాటల నాలకించి పక్కున నవ్వి తమలోఁ దమ రేమో మాటలాడుకొని దానికి స్వాభిప్రాయము దెలుపఁగల హంస నియోగించెను. ఆకలహంసయు నాకలవింకమునుగాంచి యిట్లు పలికెను. దాని మోమున నవ్వు నాట్యమాడుచుండెను. కలవింకమా ? నిన్నుఁగాని నీరాజును గాని వాని యేలుబడిని గాని మే మెఱుంగము. ఇంతదనుక నేమేమో కూతలు కూసితివి. ఇంకనైన నోరుమూయుము. పల్లెత్తుమాట మఱఁగూసితివా నీగతియేమగునో తెలిసికొనఁగలవు. మామాటలా యవివేకభూపాలునకుఁ జెప్పుము. "నీ వెవ్వఁడవో మే మెఱుంగము. ఈ రాజ్యమునకు నీవధిపతివని యిపుడేవిని యచ్చెరువందితిమి. ఇఁకముందెన్నఁడు గాని యిట్టికూతలు కూయకుము. అధికప్రసంగము చేసితివా నీవీ లోకమున నుండఁజాలవు." అని తెల్పుమని సాగనంపెను. కలవింకమప్పుడే కదలి మోము వ్రేలాడవైచుకొని పదములు

తడఁబడుచుండగాఁ దన యేలిక కడకుంబోయి హంసల వాక్కులు వినిపించెను. ఆతండు విని గోపమునఁ గన్ను లెఱ్ఱ వాఱఁగా నిపుడే యుద్ధమునకుం బోవలయునని యాజ్ఞాపించు చుండ నొకవృద్ధపారావతం బా సభలోనుండి తత్ప్రయత్న మంతయు నెఱింగినది గావున నిట్లు పలికెను. అవివేకులారా! త్వరపడకుఁడు. మానప్రాణములను గోలుపోవఁ బ్రయత్నించుచున్నారు. మీరిపుడు యుద్ధమునకుం బోయిన మరలి రాఁ జాలువాఁడొక్కఁడు నిందులేఁడు. ఈకలవింకములు పుల్లలేరికొనివచ్చి గూండ్లుకట్టుకొనుటకుం దగినవి కాని యుద్ధమునకుం దగినవా? డేఁగలు హంసములకుఁ బ్రియమిత్రములు. ఒక్కడేఁగవచ్చిన నిన్ను నీ బంధువులం జంపి ప్రియమగు నాహారము దొరకెఁ గదా యన్న యానందంబునం బోవును. తెలివిమాలిన వారిం గొందఱం గూర్చుకొని రాజనామమును నీవే పెట్టుకొని త్రుళ్ళిపడుచున్నాఁడవు. డేఁగకొక్క కబళమగుదువు. చాలుంజాలు నీ ప్రయత్నము. ఇంకనైన నూరక యుండుము. ప్రాణములుదక్కును. అనియొత్తిచెప్పినఁ గలవింకములెల్ల డేఁగమాట వినఁబడఁగనే గుండెలు తటతటంగొట్టుకొనమోములు వ్రేలవైచుకొని క్రిందు చూచుచుండెను. పారావత రాజును వీరభటుల యాననములం గాంచి యేమియు మాటాడకయూరకుండెను. ప్రొద్దెక్కుటయుఁ గలవింకము లెల్లఁ దమ పిల్లల కాహార సంపాదనము నిమిత్తమై నలు దెసలకుం బోయెను. పావురము తన యాహారమునుఁ దెచ్చుకొనుటకై యెందో పోయెను.

---

# ఐదవ ప్రకరణము.

## కార్యక్రమము.

ఆ మహారణ్యమునం దిరిగి తిరిగి యధికారుల వాక్కుల నెఱింగించి శుకములు తమస్థానమును జేరఁగలెను. కంక గృధ్రాదులు వానింగాంచి యాదరించిమార్గాయాసమునకోర్చి కులాభిమానముం బాటించి గౌరవంబునుగోరి పాటుపడిన మీకు నాపక్షిరాజు వినతాతనయుండు సర్వదా శుభంబుం లొసంగుంగాక యని దీవించి బడలికలడఁగ నిండ్లనాలుగు దినములు విశ్రమించి నియమితదినమునకు మూఁడుదినములు ముందుగ రావలయునని పంపెను. అవియు వాని యానతి శిరసావహించి తమతమయిండ్లకుం బోయి సుఖంబుండెను. కొలఁదిదినము లిట్లు సాగెను. ముహూర్తము సమీపమునకు రాఁగాఁ గంకగృధ్రాదు లొక్కచోటఁ జేరి మంత్రాలోచనము చేయఁబూనెను. శుకములుపావురములు లోనగు పక్షులందే యుండెను. అత్తఱిఁ గంకపక్షిలేచి కంఠధ్వని గంభీరముగ నుండఁగా నిట్లు పలికెను.

పతత్త్రివర్యులారా! ముహూర్తము సమీపమున నున్నది. తగుప్రయత్నములు జేయవలయును. బహుదేశముల నుండి నాయకులు పరివారములతో నరుదెంతురు. తగినవసతులు కల్పించి భోజనాదుల కనునగు పద్ధతుల నేర్పఱుపవలయును. ప్రయత్నములు రమ్యముగా సాగవలయును. విశేషించి యాంతఃకలహము లంకురింపకుండఁ జేయవలయు. ఏయేపనుల కేయే వారు తగుదురో వారి నియమింపవలయుఁ గదా. మనమింక

నూరకుండిన లాభమేమియులేదు. తరువాతఁ జేతులు పిసిగికొని న లాభమేమి? అనిన గృధ్రములేచి యిట్లుపన్యసించెను. నామిత్రునివాక్కుల నాలకించితిరిగదా. ఆతఁడు దీర్ఘాలోచన ముగలవాఁడు. సాహసవంతుఁ డింతకంటె లేఁడని మొన్ననే యొకసభలో నగ్రతాంబూలమాతనికే యిచ్చిరికదా. అదిమన మెల్లరముచూచితిమికాదే. ఆతఁడుపదేశించినవిషయములన్ని యుసమంజసములే. ఆరీతిగా మనమందఱము చేయవలయును. గౌరవమునకుఁ తగినట్లు మర్యాద చేయకయున్న మనకు గౌరవ ము నిలువదుకదా. కాఁబట్టి యొక్కరీతిఁ బ్రణాళిక నిర్ణయించి తిని. ఆలకింపుఁడు.

కంకపక్షివర్యుఁడు నేనును గార్యనిర్వాహకులమయి యే యుంటిమి. డేఁగ కార్యనిర్వాహకసహాయుఁడు కావలయును. దీర్ఘపాదుఁడు గృహనిర్మాణ కార్యదర్శిగా నుండఁదగు. విచిత్రవర్ణుఁడను శుకవర్యుఁడు వచ్చినవారికెల్ల నాయా వేళల లాహారములను గూర్పఁదగువాఁడు. మధురస్వరుఁడను కోకిల నాయకుఁడు సభాభవనమునందును మఱియుఁ దదుచితగృహముల యందును గానమాచరింపఁ దగువాఁడు. ఆతనికిసహాయముగా వాయసవరుఁడుండువాఁడు. స్వాగతపత్త్రిమును దూతకృత్యము నిర్వహించిన శుకములే చదువఁదగును. రాత్రుల యందు వెలుతురు గల్గింప జ్యోతిరింగణంబులు (మిణుఁగురు పురుగులు) సాయపడవలయు. వానిం బురుగులనరాదనియుఁ బక్షిజాతిలోఁ జేర్చితి మనియు మొన్ననే శాసించితిమికదా. తక్కిన యిక్కడఁగల పక్షులన్నియు యథానుకూలముగా మనకన్నికార్యములందును దోడ్పాటు గావింపవలయును.

ఇందులకంగీకరింపక తిరుగుపాటు చేయువారిని పక్షిరాజగు గరుడునకుఁ దెలుపవలయు. అనిపలికి యూరకుండెను. ఆ నియమమునకంద అంగీకరించిరి. వారు వారు చేయఁదగు ప్రయత్నములఁ జాగరూకులై యుండిరి.

అచ్చటఁ బారావత భూరమణుండు కలవింకములు లోనగు తనపరివార భటులంగని మనమిఁకఁ జేయఁదగినపని యేమని యాలోచింప సభగావించెను. కలవింకము లిట్లనియెను. ప్రభూ! మనము యుద్ధమునకుం బూనిన సాయపడువారు తక్కువ. పరదేశమునుండి వచ్చిన హంసాదిపక్షులన్నియు మనల నగౌరవముగాఁ జూచుచుఁ గంకగృధ్రాదులకు సాయ పడ నూహించుచుండును. మనమన్న నీచులమని వాని భావము. వారువిద్యాధికులని వారితో బుజములు కలుపుచుండును. మనల నడఁగఁద్రొక్కఁబూనును. కావున మనమిందుఁగల పులుఁగులలోఁ గొందరకు హితముపదేశించి యన్యాయమని తోఁపక యుండఁజేసి వానిపై నీర్ష్యపుట్టునట్లుచేసి మనపక్షమున నుండఁ జేసికొని మనమాసభకుం బోయి కుట్రలుపన్ని రాజ సభ్యులలోఁ గొన్ని తావులను మనమాక్రమింపవలయు. సభ్యులు చెప్పినట్లే రాజు ప్రవర్తింపవలయునఁట. కావున నాప్రయత్నము ను జేయుటయే యిప్పటికుచితమని తోఁచెడిని. తరువాత దేవర వారిచిత్తమని యూరకుండెను. తక్కినవారు కొందఱీ మతమునే యంగీకరించిరి. మఱికొందఱు సంగరమే మంచిదనిరి. తుదకుఁ గలవింకముల మార్గమే యంగీకృతమయ్యెను. తొలు దొలుత నాసభకుం బోయి యందుజరగు విషయములందిలకించి రాజేవాగగుదురో వారికనుగుణముగాఁ బ్రవర్తించువారెవ్వ

రో తెలిసికొని మంత్రిపదవు లెవ్వరికి లభించునో కనుఁగొని సభ్యుల పదవులు మనకై వశము చేసికొనఁ బ్రయత్నింతము. అపుడు పక్షులన్నియు మనలఁ గనిపెట్టుకొని తిరుగును. పరదేశమునుండి వచ్చిన హంసాదిజలవిహంగముల పని తర్వాత నాలోచింతము. ఎట్టులైన వీని నిటనుండి వెడలఁ గొట్టింతము. ఇదియే మనకిపు డుచితమగు మహాకార్యమని కలవింకములు నుడువ రా జందులకు సమ్మతించి ప్రయాణసన్నాహ మొనర్పుఁ డని సేవకుల కాజ్ఞాపించి యతఃపురమగు కొమ్మలచాటునఁ గల శుష్కకాష్ఠవినిర్మితకులాయమును జేరెను. సేవకులాయా కార్యముల నాతురులై చేయుచుండిరి.

కమలాకరమున స్వేచ్ఛగా విహరించు జలపక్షుల కాదినమునుండి కలవింకము మాటవలన నుద్వేగము కలిగెను. కలహంసాదు లొక్కనాఁ డాలోచించి పారావతరాజు యొక్కయుఁ దత్పరిజనులయొక్కయు దుర్నయములఁ గొన్నింటి విన్నవి గావున వీని యాటోపము నడంపకయున్న సాధువులకు బాధయగుటయే గాక యీవనము సాధుజనాగమ్యము గూడ నగునని యూహించి యాసభాముఖమున వీనిదుండగములఁ దెలిపి ముఖభంగము చేయించుటకన్న మంచియుపాయము వేఱొండులేదని నిశ్చయించెను. బెగ్గురుపక్షులు లోనగు నవన్నియునందుల కంగీకరించెను. ఆముహూర్తము నాఁటికిఁ దమరెల్ల రాసభకుం బోవఁ దగుప్రయత్నముల నుండిరి. జక్కవలు లోనగు జలపక్షులన్నియు నొక్కమాటగాఁ బలుకవలయు ననియు న్యాయసమ్మతముగా నామాట యుండవలయునే కాని స్వకార్యము కొఱకు న్యాయముతప్పి జగడ

గొండులవలెఁ బలుకరాదనియుఁ గూడ నిశ్చయించుకొనెను. తమ కపజయము కలిగినను విన్నవారు నలువురు సంతసించినఁ జాలునని యాపక్షుల నాయకుని భావముగావున నామాట కన్నియు సమ్మతించెను. కార్యప్రణాళిక యిట్లుండవలయునని తీర్మానించుకొని యథాపూర్వముగాఁ దమతమ కార్యముల యందు హెచ్చరిక గలిగియుండెను. తక్కిన వృక్షముల మీఁదనుండు నగౌకములుకూడఁ దమతమ యోగ్యతకుం దగినట్లు పరివారమును బిలుచుకొని యనంతశైల శిఖరము నకుఁ బోవ నాయత్తపడు చుండెను.

---

## ఆఱవ ప్రకరణము.

### రాజాదుల నిర్ణయించుట

శైలశిఖరమునఁ గల తొట్టిమట్టిచెట్టు క్రిందిభాగము చక్కఁగా నలంకరింపఁ బడెను. దానిపొడవైన కొమ్మల క్రిందఁ జల్లఁగా నున్నందున భూమియంతయుఁ జక్కజేయఁ బడియెను. ఆ చెట్టుకొమ్మలు జొంపముగా నుండెను. పగడ ములం బోలె దానిఫలములు కనుపండువు చేయుచుండెను. ఏ ప్రక్కఁ జూచినను క్రోశమాత్రమాకొమ్మలు వ్యాపించియుం డెను. దానిచుట్టునుంబట్టును గలవృక్షముల మీఁద ననేకగృహ ములు దారుశకలములతో నమర్పఁబడియెను. గడ్డి మొదలగు మెత్తనిపదార్థములచేఁ గొన్నిగూండ్లు నిర్మింపఁ బడియెను. ఆమట్టికిం దూర్పుప్రక్క నొక్కసరస్సుండెను. దానియందుఁ గల జలముల లోఁతు గన్నవారు లేరని యందఱు నొప్పుకొని

నదియే.ఆజలముల నిండఁ దామరతీఁగెలు వ్యాపించియుండెను. కాఁబట్టి పద్మలతాపత్రములే కనఁబడును గాని జలము కనఁబడకుండెను. గాలి తాఁకునఁ గమలము లటునిటు కదలుచుండ నాసందున జలమున్న జాడతోఁచునే గాని లేనితఱిఁ దోఁపదు. ఆసరోవరమొక క్రోశమాత్రభూమి నావరించి యుండెను. అందు జలపక్షు లానందమున నుండును. అవి యన్నియు దూరదేశమునుండి వచ్చి తమజాతిపక్షుల కాతిథ్యమియ్య సంతోషమున నంగీకరించి తమచేతనైన సాయమింక నేమికావలసి యున్నను జేయ నంగీకరించెను. జలపక్షుల కాహార విహారముల కాసరస్సు చాలునని కార్యదర్శిగా రంగీకరించిరి. తత్సహాయులు కూడ నంగీకరించిరి. స్థలపక్షుల కనువగు నాహారమునకుగా గడ్డిగింజలు ప్రోగుచేయఁ బడినవి. ఫలములు దాఁచిపెట్ట వలను పడదుగావున మఱ్ఱిచెట్టు చెంతనే యడవిలోనున్న ఫలవృక్షముల కడఁ గావలియుండి భోజన కాలములఁ దప్ప నితరకాలములయం దేపక్షులు నచ్చటికి రాఁగూడదనియు వచ్చినచోఁ గఠినశిక్ష యగునని తెల్పవలయుననియుఁ గట్టడిచేసి పక్షులు గావలి యుంచఁబడినయెను. లక్షసంఖ్యగల పక్షులు వచ్చినను గొఱంత నేవిషయమునఁ గలుగక యుండఁగట్టుదిట్టములు చేయఁబడియెను. ఆ మహావృక్షమూలమున నొక సింహాసన మమర్పఁ బడియెను. ముందుగా గొప్పవేదిక (అరుగు) వేసిదానిపై దారుశకలముల నొక యాసన మమరించిరి. పెక్కురంగుల యాకులు తీవలు తెచ్చి దాని నలంకరించిరి. దానింజూడఁగా మరకతరత్నములచే నమర్పఁబడియెనని యూహా కలుగక మానదు. దాని

యందందందు మట్టిపండ్లునుంపఁబడియెను. కావున మాణిక్య ములు (కెంపులు) స్థాపించినట్లు కనఁబడుటయే గాక వింతగఁ గూడఁ గనం బడుచుండెను. దానిపై భాగమునఁ గొంచె మెత్తుగా నొకమట్టి కొమ్మయుండెను. దానియాకులు దట్ట ముగా నుండెను. అది యొవితానము (మేలికట్టు) గాఁ గనం బడుచుండెను. దానియందము వర్ణింపఁ దరముగాక యుండెను. దానిక్రింద జాలుగా రెండుప్రక్కల నిట్లేఁ కొన్నియుచితాసన ములు దారుశకలములచే (పుల్లలచే) నమర్పఁబడియెను. వాని యందుఁ బ్రతినిధులుమాత్రమే కూరుచుండవలయునని నియ మము చేయఁబడియెను. తక్కుంగల ప్రేక్షకులు భూతలం బునఁ బరచియున్న కోమలవృక్షపత్రములపైఁ గూరుచుండి వేడుకచూడవలయునను విధి కలదు. దాని ననుసరింపక యున్న నటనుండి వెడలఁ గొట్టఁబడుదురని యాయాయి తావులఁ జాటింపఁ బడియెను. దాని విని ప్రేక్షకపక్షులన్నియు నుచితరీతి మెలంగ నిశ్చయించు కొనియెను. సభకు మూఁడు దినముల ముందుగా నీప్రయత్నము లన్నియు నెఱవేర్పఁ బడి యెను. సింహాసనాలంకారము మాత్రమా తొలిదినమున మరలఁ జేయవలయు నని యన్నియుఁ దీర్మానించు కొనియెను. పరీక్షకపక్షు లరుదెంచి యాశిల్పమును దిలకించి వేయినోళ్ళం గొనియాడి శిల్పివర్యములకు నావనములం గల ఫలవృక్షముల మూఁడింటిని బహుమాన మీవలయుననియు సభాకాలమునఁ గృతజ్ఞతం దెలుపు వందనములు మూఁడు పర్యాయము లర్పింపవలయుననియుఁ దమసమ్మతము నాహ్వానసభ్యులకుం దెలుప నట్లే యొనరింప నంగీకరించి యప్పుడే పండ్లచెట్లను

మూఁటిని వానికిం జూపి యీమూఁడుదినములు స్వేచ్ఛగా ననుభవింపుఁడని చెప్పెను. ఆశిల్పిపక్షులు మహానందమున నాచెట్లపై మూఁడుదినములుండ నిశ్చయించుకొనియెను. వానికిం గల్గిన మర్యాదం గాంచి తక్కినవారందఱు తమరు పాటుపడి కార్యము నిర్వహించిన నిట్లే సభాముఖమున మర్యాద కలుగును గదా యని యాలోచించి యాఁకలి దప్పుల లెక్కింపక పాటుపడం గడంగిరి.

## మహానభోత్సవము

నాల్గవదినమున మాఘశుక్ల సప్తమీ మంగళవారమునఁ దొలిజాము పూర్తముగాఁ గడువకముందే నానాభాగములనుండి పతత్త్రిసముదయములు మధురనినాదములఁ గానసమును బ్రతిధ్వనింపఁజేయుచు వచ్చిచేరెను. స్థలజలపక్షులన్నియుఁ దమపరివారములను వీరభటులను గూడి యరుదెంచి తమకేర్పాటుచేయఁబడిన విడుదులం జేరిరి. ఒక్కొక్క విడిదియింటను దాటియాకుపైన వ్రాసి యందు దిగఁదగిన పతత్రినామము స్పష్టముగాఁ దెలియునట్లు కట్టఁబడియుండెను. ఆపేరు దాఱుమాఱుగాక యుండఁగని పెట్టుట కందొక పక్షి కావలియుండెను. తొలిజాము పూర్తియగువఱకు నన్ని పక్షులు వచ్చిచేరెను. పారావతరాజు తనపరిచరులగు కలవింకములనుగూడి యరుదెంచి సరోవరమునకుఁ జేరువనున్న బూరుగుచెట్టుమీఁదఁ గట్టియున్న పత్రమునుగాంచి యందు విడిసెను. కావలియున్న పక్షిశాబక మబ్బలమునకు నుచిత రీతి సత్కారముచేసి యందు విడియించి వారివస్తువులను

గాపాడి యిచ్చెదననియు నిచ్ఛానుసారము తిరుగవచ్చునని
యుఁ జెప్పి తానెచ్చరిక గలిగియుండెను. సరోవరమునుండి
జలవిహంగము లెల్లఁ దమనాయకుఁ డగు కలహంసేశ్వరునిం
గూడి వచ్చి యాకమలాకరమున విడిసి యందుజరగిన మర్యా
దకు నతిశయామోద మందుచు నందేయుండెను. పారావత
రాజున్నతావున కాసరస్సు చెరువనుండెను. కలవింకముల
రాకయు నందను దమ విడిదికిఁ జెంతనే యవియు దిగుటయు
నెఱింగి కలహంసపరివారమందే వీనికిఁ దగిన శాస్తిచేయవల
యు నని యూహించెను. కాని మరల నవియేమే నగౌరవ
ముగా మాటలాడిన నాపని చేయవచ్చును గాని మనయంత
న మనమరిగి యిట్టియకార్యము చేయరాదని నిశ్చయించు
కొనియెను. తమజాతి కనువగు మర్యాదకు విరుద్ధముగాఁ బ్రవ
ర్తింపరాదనియు, నట్లు ప్రవర్తించిన నితరులకు మనముత్రోవ
చూపినట్లగుననియు దానఁగీడు వాటిల్లుటయె గాక శాశ్వత
కాల మపకీర్తియొదవు ననియు నూహించుకొనియెను.

మధ్యాహ్నకాల మతిక్రమింపనుండఁగా శిశుపోషక
ములు తమకంఠస్వరమున నిఁక నందఱు రావచ్చునని హెచ్చ
రించెను. ఆమ్రోఁత దిగంతములకుఁ జెవుడుగల్గఁజేసెను.
సభారంభము కాఁ దగు సమయము గదా యని యాపక్షి
వతంసము లెల్లఁ దమ తమ పరివారముం గూడి రా మొదలు
పెట్టెను. చీమలపుట్ట బ్రద్దలైనట్లు, భూమి యీనినట్లు వాని
రాక గాన్పించెను. ఒక్కరిమాట వేఱొక్కరికి వినఁబడక
యుండ వాని ఱెక్కలచప్పుడు వ్యాపించెను. సగముజాము
దనుక నాశబ్దము వినఁబడుచునే యుండెను. అంతనాశబ్దమిం

చుక తగ్గెను. శిశుపోషకములు తమగుంపు నలుప్రక్కల నిలువంబడి ధ్వని నాపుచుండగా సర్వకార్యభారములు తమ యందే యున్నట్లు భావించుకొనుచుండెను. ఎల్లనాయకులు తమ తమ పీఠముల నలంకరించిరి. వారి పరిచరు లాచేరువఁగా వెనుకప్రక్కన నుండిరి. ముహూర్తకాలము సమీపించెనని క్షీరపతత్రి హెచ్చరించెను. నీలాంగము నిజమే యని కూసెను. శిశువులఁ గాపాడఁజాలనిపక్షి శుభసమయమిదే వచ్చుచున్నదని కలనాదమునఁ దెలిపెను. ఎల్ల నాయకులును ముఖనాదముల జయముజయము గరుత్మంతునకని పలికెను.

అంతలో నాకాశమున నొక నీడ వ్యాపించెను. దాన నంధకారముగఁ దోఁచెను. మఱిక్షణమునకు నొకపక్షవాత ధ్వని వినఁబడియెను. ఇదేమని వారెల్ల నిక్కిచూచిరి. ఆకారమగ పడలేదు. దూరదృష్టి గరుడపక్షులకుఁ గలదు. కావున వానింజూడుఁడని యన్నియుఁ బ్రార్థించెను. మాకంటె గ్రద్దలకాదృష్టిపాటవ మధికము కదా యని యవి బదులు పలికెను. మీరుభయులు కలిసి పరీక్షింపుఁడని యన్నియు వానిం బ్రార్థించెను. అట్లే చూచియేదో యొక భూత మరుదెంచు చున్నదని తెలిపెను. అందరికిఁ మేనఁబ్రాణములు లేవు. శవములవలెఁ గూలఁబడిరి. అంతలోఁ గలహంసమించుక దిటవు తెచ్చుకొని మనప్రభువరేణ్యుఁడై యుండనోపు. ఆమహానుభావుఁడు సర్వమెఱుంగ జాలును. మన యీప్రయత్న మెల్ల మదికిఁ దట్టగా నిట్లువచ్చుచున్నాఁడు కాఁబోలు. అని పలుకునంతలో పక్షిరాజు విష్ణువాహనము కుంకుమారుణగాత్రుఁడు కరుణాసాగరుఁడు గరుత్మంతుఁడు వచ్చు

చున్నవాఁడు. జాగరూకులరగుఁడు అను ధ్వని వినవచ్చెను. హంసమాటలు సత్యములని వారెల్ల నాహంసపుంగవునిఁ బొగడిరి. కంకగృధ్రములు లేచి పూజా ద్రవ్యములంగొని వేచియుండెను. క్షణకాలమున కంబరమునుండి యాచోటి కవతరించి వారికావినతా నందనుఁడానందముఁ జేకూర్చెను. ఎల్లవారు నమస్కరింప నాశీర్వదించెను. సింహాసనమున నందఱు వేఁడఁగాఁ గూరుచుండెను. సభాభవనమంతయు శాంత సముద్రమువలె నిశ్శబ్దముగ నుండెను. అంత నా గరుత్మంతుఁడు సర్వపక్షివరేణ్యులు విన నిట్లుపన్యసించెను.

నాతోఁబుట్టువులారా! బంధువులారా! మిత్రములారా! మీరెల్ల మేము లోకాంతరమున నున్న కతన మాకుఁ బ్రతినిధిగా నొకరిని నాయకునిగా నిర్మింపఁబూనుట మంచి కార్యము. మాకుఁ బరమానందముగా నున్నది. రాత్రి యోగవిద్యానుష్ఠానమున నుండఁగా నీప్రయత్నము మనస్సున గోచరించెను భగవంతుని యనుజ్ఞఁబడసి కార్యాంతము లెన్ని యున్నను మాని యీ సభాకార్యము క్రమముగా నడుపవచ్చితిమి. ఇందుఁ బెక్కులు విఘ్నములు పొసంగును. వానినెల్లఁ దొలఁగించుకొన మీకు శక్తిగలదుగాని యాయది కాలక్షేపమున కాస్పదమిచ్చునని వచ్చితిమి. ఇంక సుముహూర్త మాసన్నమగుచున్నదికానఁ గార్యమున కుపక్రమింపుఁడు. అని పలికి వారినెల్ల నానందసాగరమున నోలలాడించి కూరుచుండెను.

అంతటఁ గార్యము నిర్వహింపఁబూనిన కంకగృధ్రములు లేచి సభారంభమునకు ముందుఁజేయవలసినది భగవ

న్నామస్తుతిపాఠము. కావున నాకార్యమును ఫలభక్షుకములు చేయునని కూరుచుండిరి. అత్తఱి రెండు ఫలభక్షుకములు లేచి సవ్యపాదము లెత్తి ప్రభువునకు సభ్యులకు నమస్కరించి యిట్లు దైవప్రార్థనము చేసెను.

శ్లో॥ అగ్రేదీర్ఘతరోఽ యమర్జున తరుస్తస్యాగ్రతో వర్తనీ
సాఘోషంసముపైతి తత్పరిసరేదేశేకళిందాత్మజా।
తస్యాస్తీరతమాలకానన తలే చక్రంగవాం చారయన్
గోపః క్రీడతిదర్శయిష్యతి సఖేపంథానమవ్యాహతమ్।
మందం మందం మధురనినదైర్వేణు మాపూరయంతం
బృందంబృందావనభువి గవాం చారయంతంచరంతం।
ఛందోభాగేశత మఖముఖధ్వంసినాందానవానాం
హంతారం తం కథయరసనే గోపకన్యాభుజంగమ్॥
కరారవిందేన పదారవిందం ముఖారవిందేవినివేశయంతమ్.
వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మన
సా స్మరామి॥
కుంకుమాంకితవర్ణాయ కుందేందు ధవళాయచ
విష్ణువాహనమస్తుభ్యం పక్షిరాజాయ తేనమః॥

ఆస్తుతిని విన్నంతనే బాగుబాగనునినాద మాకాశమునఁ బర్వెను. ఎల్లవారును లేచి భక్తిభారమునఁ దలలు వంచి యాలకించి భగవంతునకుఁ దమ ప్రభువునకు నమస్కరించి కూరుచుండిరి. కార్యనిర్వాహకుఁడగు కంకనాయకుఁడు లేచి సభాకార్య క్రమము లోనగు విషయములుగల పత్రము నిట్లు చదివెను.

ఆర్యనగాక ప్రముఖములారా! మనమీ యరణ్యమునఁ జిరకాలమునుండి యున్నవారము. ఏబాధలు లేక యున్నవి. కాని మన రాజ్యమనిగాని, పాలకుఁడనిగాని, మంత్రులనిగాని, సింహాసనస్థానమని గాని యేర్పాటులేదు. ఇందలి యాటవికులు నిన్నగాక మొన్నరాజ్యము స్థాపించుకొనిరి. మృగములు స్థాపించుకొని సింహమును రాజుగాఁ జేసికొని మర్యాదగానున్నవి. మనకట్టి దీయడవినుండకయున్న మనకాపదలు గల్గనెవ్వరితోఁ జెప్పుకొనవలయును? ఎవరు తీర్తురని నమ్మియుండవలయును? మన ప్రభువు లగు గరుత్మంతులు విష్ణులోకమున నారాయణ కైంకర్యమున మన కార్యములు విననైన నవకాశములేక యున్నవారు. వారి కూఱటగా నిందొక్కనాయకుని వారి పాదారవిందభక్తుని నియమించి వారి మూలమున రాజ్యవ్యవహారములు నడపుకొన్న మేలని తోఁచినది. మాయీయూహ కెల్లవారును సమ్మతించిరి. అదియే యీమహాసభా ప్రారంభమునకు మూలకారణము. ఉచితరీతి నెల్లరం గూర్పఁ బ్రయత్నించితిమి. మా యీ ప్రయత్నమును ద్రోసిపుచ్చక మాయాతిథ్యము నంగీకరింప మహాదరమునఁ బ్రధానులెల్లరు సానుచరులై యరుదెంచి మాకానందమును గూర్చిరి. ఇక్కార్యము సత్యహితమనుటకు భగవత్పాదుల యాగమనమే సాక్ష్యమిచ్చుచున్నది. వేయేల? కాలహరణముచేయక యీపని మంచిదని మీరెల్లరంగీకరించి రాజప్రతినిధిని నిర్ణయించి రాజ్యమును జక్కఁగా నెలకొలుపఁ బ్రార్థించువారము. మాయాతిథ్యమున నెన్నిలోపములున్నను వానినెల్లసరకుగొనక కార్యనిర్వహణమే ప్రధానముగాభావిం

తురని వేఁడుచున్నారము. విచ్చేసి సభనలంకరించిన మీకెల్ల హృదయపూర్వకముగా స్వాగతమొసఁగుచున్నారము. ఎన్నియో భేదభావములుండవచ్చును. వానినెల్లఁ బాటింపక మహాకార్యము నిర్వహించి యందఱిలో మర్యాదగా మనజాతి సంచరింపనాలోచింతురని మఱియొక పర్యాయము మిమ్ము వేఁడుచున్నారము. విశేషించి వచించుటకిది యదనుకాదు. కార్యములు మెండుగానున్నవి. ఈనాల్గు చప్పిడిమాటలతో మా విన్నపమును ముగించుచున్నారము.

అని కార్యనిర్వాహకులు కూరుచుండి నంతట గుసగుసలారంభములయ్యెను. రాజనిర్ణయమున ననేక భేదాభిప్రాయములు గల్గెను. చక్కఁగా మాటలాడు నేర్పు గలదు. కావున శుకము రాజుగాఁ దగునని కొందఱనిరి. గట్టిగాఁ గూయుచు నందఱ హెచ్చరింపఁగలదు. కావున శిశుపోషకము రాజుగా నుండిన బాగుండునని మఱికొందఱనిరి. అందఱిని బెదరింపఁగల శక్తికలదు. అంతియగాక వాడిముక్కుగలదు. కావునఁ గంకపక్షివర్యుఁడే రాజు కాఁ దగినవాఁడని కొంద ఱుద్ఘోషించిరి. దూరదృష్టియు నంబరమున కెగుర శక్తియుఁ గలదు గాన గృధ్రమాపదవికిం దగునని యింకనుం గొందఱు వక్కాణించిరి. జాగ్రతగలవాఁడు కలవింకనాయకుఁడు. ఆతనికిం బట్టము గట్టిన బాగుండునని మఱికొందఱు తేటపడఁ బలికిరి. కంఠము మనోహరముగా నుండును. పింఛమును విప్పి యొక్కసారి యాడిననెల్లరు నబ్బురం పడుదురు. కంఠస్వరము దూరమునకు వినంబడును కావున మయూర మీపదవి నధివసింపఁ దగినదని యొక్కకొందఱు పట్టుదలం జూపి భాషించిరి. సా॥ తా

పాత్ర వివేకము రాజునకుఁ బ్రధానముగా నుండవలయును. కావునఁ గలహంసమాపదమున నభిషేకింపఁ దగినదని వేఱొక్క కొందఱు నుడివిరి. చూచినంతనే నయనములనుండి నిప్పుకలు వర్షించును. ధ్వనిచే నెల్లర భీతులంగా నొనరించును. కావునఁ గౌశికముఁ (గూబ) రాజుగానుండినఁ బాలనము చక్కఁగా సాగునని యొక్కకొందఱు సంభాషించిరి. ఇట్లు నానాప్రకారముల సంభాషించుచుండఁ బ్రొద్దు చాల ప్రాలెను. ఏది నిర్ణయింతమన్నను బ్రతివాదము రాసాగెను. కావున నేఁడు నిర్ణయింపవీలుండదేమో యను భయమెల్ల వారికిం దోఁచెను. అత్తఱి నావాదప్రతివాదముల నాలకించి గరుత్మంతుఁడు లేచి యెల్లవారు విన నిట్లు వాక్రుచ్చెను.

పతత్త్రిపుంగవులారా! ఇట్లే వాదోపవాదములు సాగుచుండు నెడల నేదియు సిద్ధాంతము కానేరదు. కాక యున్న మే మిందు నిలువ వలనుపడదు. అనేక కార్యములు మాని మీయాశయమును జక్కఁజేయఁ బరాత్పరుండగు శ్రీమహావిష్ణువు నాజ్ఞఁగైకొని వచ్చితిమి. మీరింతకు ముందు సూచించిన వారిలో నీపదమునఁ గూరుచుండి రాజ్యము నిర్వహింపఁగల వారొక్కరును మా బుద్ధికి సరిపడలేదు. కావున మేమే మాకుం బ్రతినిధిని నిర్ణయింతుము. మంత్రులను నిర్ణయింతుము. సభ్యులను నిర్ణయించుటకు మీకధికార మొసంగెదము. ఈ మాభావమును మీరెల్లరంగీకరింతురని నమ్ముచున్నారము. మీసమ్మతులఁ దెల్పుఁడు. అని గంభీరోపన్యాసమునఁ దమ భావమును దెలిపి కూరుచుండిరి. గరుత్మంతుఁడా యుపన్యాసమున నించుక మోమునఁ గ్రోధలేశమున్న జాడఁగనఁ బఱ

చెను. ఆమోముంగని పక్షివర్గములు గడగడవడంకుచు నోట నుండి మాటరామినూరకుండి బదులుచెప్పక యున్న నింకే మనునో యని భీతినంది యెట్లో ధైర్యము తెచ్చుకొని మహా ప్రభూ! ఏలినవారి చిత్తమునకు నుచితమనితోఁచిన దానిని జేయవచ్చును. మే మందులకు నంగీకరింతుము నిస్సంశయము. ఇంచుకంతయు శంకనొందనవసరములేదు. మీకు నాలోచనము చెప్పునంతటి యోగ్యత మాకుం గలదా. ఏలినవారి పాదమూలముల నాశ్రయించి బ్రతుకు వారము. ఇంచుకయు సంశయింపక సెలవిండు. ఆలకించి కృతార్థులమయ్యెదము. తమ యానతికై వేచియున్నవారము. అనిపలికి పక్షిరాజునకుఁ దమ కృతజ్ఞతను దెలుపుకొనియెను.

అత్తఱి వినతానందనుఁడు మరల లేచి సుదర్శననామకుఁడు గరుడుఁడు మాకుం బ్రతినిధిగా మీరాజ్యమును బాలించువాఁడు. ఆతనిశక్తియపారము పౌరుషశాలి. సుగుణాఢ్యుఁడు. భూతదయాలంకారుఁడు. కావున నాతఁడు మీకురాజుగా నుండి మాయానతి ప్రకారము రాజ్యమును బాలించును. మఱియు వివేకశాలి సాధువర్తనుఁడు దీర్ఘదర్శియు మనోహరాకారుఁడు నగు కలహంసనాయకుఁడు చారుమతి మంత్రిగానుండఁ దగును. వేగవంతుఁడనుపేరుగల గృధ్రరాజు సేనాపతిగా నుండనర్హుఁడు. తక్కిన యుద్యోగుల నీమువ్వురే నిర్ణయించుకొనఁదగు. ఇఁక నీరాజ్యపాలనము నిరంకుశముగా సాగుటకు న్యాయము తప్పకుండుటకు నేనుగురుసభ్యు లుండవలయు. వారినాయా స్థలములనుండు పక్షులెన్నుకొని పంపవలయును. ఈ మహాటవి నాల్గుదెసలకు సీమలనేర్పఱచి యొక్కొక్కరాష్ట్రి

మున కొక్కొక్కరుగాఁ బ్రతినిధు లుండవలయు. మధ్యరాష్ట్ర మున కొక్కొక్కఁడును గలిసి యైదుగురు సభ్యులుండవలయును. ఈయెన్నికయునొక్కమాసమునకు మించకయుండఁగావలయును. ఆగడువు మీఱినచో మరల మాప్రతినిధులే నిర్ణయింతురు. కాని వారు మరల నిర్ణయించుకొను నధికారమా భాగమునకు నుండదు. ఇదియే మాశాసనము. ఇదియే మీకుఁ గర్తవ్యము. ఇట్లు ప్రవర్తించినచో రాజ్యపరిపాలనము చక్కఁగా సాగును. అంతఃకలహముల కవకాశము కల్గించుకొనక ప్రవర్తించునది. ఎవ్వారే నట్టి వారుండిన వారిని మాప్రతినిధియుఁ దద్దాస్థానోద్యోగులు నిర్మూలింప బద్ధకంకణులయి యుందురని నమ్ముఁడు. క్రూరమతులొక్కచోఁ జేరి యొక్కమాటగా దురుద్దేశమున నీ నియమముల కించుకయేని భంగము కల్పింతురేని వారినస్మత్పక్షవిక్షోభవాతమున నిర్మూలింతుమని నమ్మవలయును. మాయానతిమెయి నీవిషయమునఁ గడుంగడు జాగరూకులరై యుండుఁడు. మా కార్యముల నెల్లఁగట్టిపెట్టి మీప్రార్థనములఁ జెల్లింపనరుదెంచితిమి. ఉచితరీతి నేర్పఱచితిమి. రాజ్యము చక్కగా వృద్ధి నొందఁగలదని నమ్మెదము. ఇఁకఁ బోయి వత్తుము. అందఱనుమతించి నట్లే భావింతుము. ఇదె ప్రయాణము చేయుచున్నామని హెచ్చరించి సింహాసనమునఁ గూరుచుండెను.

అంతఁ గార్యదర్శి లేచి సభాపక్షమున నిట్లుపన్యసించెను. ఆర్యమహాశయులారా! పత్త్రివర్యులారా! ఈకార్య మల్పమని భావింపక చరాచర ప్రపంచమున ననేక కార్యములు గల మన ప్రభుశిరోమణులు వానిం బాటింపక యల్పులమగు

మన యభ్యర్థనము నవధరించి దయచేసి మన కార్యములను
చక్కఁగా నెఱవేర్చి మనకు సర్వసుఖములు గల్గ నాశీర్వదించి
నందుల కీసభాపక్షమున హృదయభక్తి ప్రీతిపూర్వక నమ
స్కారము లాచరించు చున్నాఁడను. వారి యానతిరీతి మేలం
గ మేమెల్ల బద్ధకంకణులమై యున్నారమని మీకెల్లఁ బ్రతినిధి
గా మనవి చేయుచున్నాఁడను. సర్వదా కరుణోదారులగు
శ్రీగరుత్మంతులు మనలఁ గనిపెట్టి యుందురనియు మా
ప్రార్థన మత్యల్పమేయైనను దాని గొప్పదిగా భావించి నెఱ
వేఱ ననుగ్రహింతురనియు నమ్ముచున్నాఁడను. ఈనియ
మముల నొక్కదానినే వీటిఁ బుచ్చక యొక్కొక్కదాని నాచ
రింతు మని శ్రీప్రభువులవారి సన్నిధి మఱొక్కపర్యాయము
విన్నవించు చున్నాఁడను. ఇంతకంటె విన్నవించు నధికారము
యోగ్యతయుఁ గూడ లేదని విరమించుచున్నాఁడను. అని
తనయుపన్యాసమును జాలించి పుష్పహారమును శ్రీమద్వినతా
నందుని కంఠమునవైచి కానిక లర్పించి వారి పాదములకడ
వ్రాలి యుండెను. గరుత్మంతుఁ డాతనిని లేవనెత్తి వీఁపునఁ
జేయినుంచి వత్సా! కడుశ్రద్ధగలిగి కార్యముల నిర్వహించి
తివి. కడుంగడు నీవిషయమున నిన్నుఁ గొండాడుచున్నారము.
అని యభయ మిచ్చిరి.

అంత నాయాకార్యముల నిర్వహించిన వారికుచితము
లగు బహుమానము లీయఁబడెను. ఎల్లరానందమున నోలలా
డిరి. ఎల్లరకు హృదయాంతరాళముల నిండు వేడుక పర్వెను.
గరుత్మంతుఁడు పరివారముం గూడి యూర్ధ్వగమనమున
వైకుంఠమున శ్రీమన్నాయణమూర్తి కైంకర్య మొనరింపఁ

ప్రయాణము సాగించెను. రాజప్రతినిధి మంత్రిప్రముఖులం గూడి కొంతదూరము సాగననిపి మరలివచ్చి సింహాసనము నలంకరించి యాయవ్యయములం బరిశీలించి సకలకార్యములను గార్యైక దేశముల నోపికమై నెఱవేర్చి సభను గొఱంతలేకసాగించినవారి ని హారాదులచేతను మంచి మాటలచేతను గారవించి సభ చాలించితిమని తెల్పెను. సాయంకాలము కావచ్చి నందున నెల్లరు తమతమ విడుదులకు నరిగి యథోచిత సమర్పి తాహారములం బరితుష్టినొంది సుఖశయ్యజేరి నిదురించి తెల తెల వేఁగినఁ దమతమ నెలవులకుం బయనముచేయ నెంచి కంకగృధ్రాదుల సెలవంది తమతమ విధులను జక్కఁగా నెఱ వేఱుతుమనియు నంతః కలహములు లేక ప్రవర్తింతుమనియుఁ దెల్పి యుచిత మర్యాదల నొంది ప్రయాణముచేసి తమతమ యిక్కలం జేరి సుఖంబుండెను.

---

## ఏడవ ప్రకరణము.

### సభ్యులయెన్నికలు—వారి దుండగములు.

గృహములు చేరినది మొదలు యథాపూర్వముగాఁ గుటుంబపోషణమున బద్ధకంకణులై యుండుటయే గాక రాజ్య పాలనవిషయమున వేడుక కలిగి తమయోపినంత సాయమొన ర్చుచుఁ బక్షివర్యము లుండెను. సుదర్శనుఁ డారాజ్యమును నెల్లనాలుగు దిక్కుల విభజించి మధ్యరాజ్య మిదియని నియ మించి యావార్త సభానంతరము కొలఁది దినములకే ఫల భక్షకముల మూలమున నెల్లరకుం దెల్పెను. వారెల్లరు తమ

కుఁ బ్రతినిధిగా నొక్కనిం బంపి సభ్యపదవి నధివసింపఁ జేయ నెంచిరి. ఆపద్ధతి యెట్లో తెలియక దానిం దెలిసికొని యారీతిగాఁ జేయ నుద్యుక్తులై యుండిరి.

సభానంతరము రాజమంత్రులు కలిసి సేనాధిపతితో నాలోచించి తమ యుద్యోగములకు సాయపడఁదగు వారిని రాజ్యపాలన విషయమున నన్నికార్యములు చక్కఁగా సాగునట్లు పాటుపడువారిని నియమించుకొనిరి. ఆస్థానమనుచోటు శైలశృంగమునఁ గల తొఱ్ఱమఱ్ఱిచెట్టుగా నిర్ణయింపఁ బడియెను. ఆదినము మొదలు కంకపక్షినాయకున కాంతరంగికచింత పొడమెను. తాను విశేషించి పాటుపడితిననియు, దాన మంత్రిపదము లభింపకుండునా యనియుఁ దనవారినవ్వాలం జేర్చుకొని రాజ్యమున గొప్ప పలుకుబడిని సంపాదించుకొనవలయును, నన్నింటిలో మర్యాదగాఁ దనజాతి యుండవలయు ననియు నాకంకపక్షినాయకుని యూహ. అందొకింత భాగమైనను గొనసాగకపోయెను. కావున నిరంతరచింతాసంతప్తహృదయుఁ డయ్యెను. ఆపక్షినివాసము మధ్యరాజ్యము. అందేమో మర్యాదను సంపాదింపఁగోరి కొండంత యాసతోఁ బనిచేసినందులకుఁ దుద కించుకంతయైనను లాభము లేకపోయినను మీఁదుమిక్కిలి మహాశ్రమము గల్గుటయుఁ దుదకింతయైన నధికారలాభము దొరకక పోవుటయు సంభవించెను. దాని బలగమెల్ల నిరుత్సాహము నొందెను. నలువురిలోనగుఁబాటు గల్గెనే యనియు నవి దుఃఖింపసాగెను. వారి యట్టహాసము తుదకుఁ గల్గిన చింతాలాభమును గని యందలి పక్షులెల్ల మఱింత చులకనగా జూడసాగెను. అది యొక్కటియే వారికి దుస్సహ

తాపమునను క్షణము గల్గింపసాగెను. కావున నెట్టులేని సభ్యత్వమునైన సంపాదించుకొని యించుక మర్యాద నార్జించి బ్రదుకవలయునని కంకనాయకుఁ డూహించెను. తనబలముల కెల్లం దెల్పెను. వారెల్ల నోఁగాక యనిరి. ఆరాజ్యమునఁగల పక్షులన్నియుఁ దమ నాసికలంగాంచి భీతిచెందుదు రనియుఁ దమ నాయకునే పంపుదురనియు నాహేతువున నాస్థానమున మాటను మర్యాదను సంపాదించుకొన నవకాశము గలుగు ననియు నవి ప్రయత్నింపఁ బూనెను. తమనాయకునకు సర్వవిధముల సాయపడుదుమని తెల్పిరి. ఎట్టులైన నన్నింటిని మట్టు పెట్టుదుమని ప్రల్లదంబు లాడిరి.

వ్యవధి కొలఁదియే కలదను వార్తయెల్లరకుఁ దెలియ వచ్చెను. ఒక్కనాఁడు తద్దేశవాసిపతత్త్రినాయకులు తమతమ పరివారముంగూడి యాలోచింపసాగిరి. ఆ దేశముననేపూర్వము రాజునని ప్రకటించుకొనిన పారావతనాయకుం డుండెను. ఆ దేశమధ్యభాగముననే సరోవరమునఁ గల హంసనాయకుఁ డుండెను. శిశుపోషక పక్షినాయకుఁడా దేశముననే యుండెను. కంకనాయకుఁడందే యుండెను. కలవింకములు నందే నివాసమును గల్పించుకొని యుండెను. ఆయడవి ననేక వానరములు విశేషించియుండెను. అవియు నాలోచించి పక్షివర్యులారా! మేమును వృక్షవాసులము. మీరును వృక్షవాసులు. మీకును మాకును సనాతనసంబంధము కలదు. కావున మాకు శాఖామృగములను నసార్థకనామముండినను బక్షములు లేకున్నను లంఘించు స్వభావముగలదుగావునఁ బక్షములున్నయట్లే మా వాలమునఁబట్టి భావింపవలయుననియు మాలో నొక్కనింబ్రతి

నిధిగాఁ బంపఁ బ్రయత్నించుమనియుఁ దమతమ మిత్రులగు పక్షినాయకులతోఁ జెప్పెను. వాలమున వచ్చునామము వాలియనియే కాని పక్షియను నామము కాదనియుఁ బక్షములుగల వారల కీపక్షినామమనియుఁ బక్షులకు రాజు భగవంతుఁడగు గరుత్మంతుఁడనియుఁ గావున మీరాపనికిఁ బనికిరారనియు వారు బదులుపల్కిరి. వానరములాలోచించి తమకు భయంపడుపక్షులఁ గొన్నింటిని లోఁబఱచుకొని పక్షములుండినను దూరమెగురలేని కుక్కుటములు పక్షిజాతిలో నున్నవి కదా. వానికన్న నెక్కుడు దూర మెగురఁజాలిన మమ్మేల పక్షిజాతిలోఁ జేర్పరాదో తెలియఁజాలకున్నామని వాదింపసాగెను. వానివాదమును గొన్ని విధిలేకయంగీకరించెను. అంగీకరింపకయున్నఁ దమగూండ్లను బాడుచేసి పిల్లలఁ జంపునని వారిభయమఁట. ఆ వాదమును విని యా యటవింగల మార్జారములు తమకుఁ దోఁకగలదనియు నింతయో యంతయో లంఘించుశక్తి తమకుం గలదనియుఁ దమ్ముఁగూడఁ బక్షిజాతిలోఁ జేర్చుకొనకతప్పదనియుఁ జేర్చుకొనక పక్షపాతమూనినఁ జెట్లెక్కి పిల్లలను గ్రుడ్లను భక్షింతుమనియు నెంతపక్షినైనఁ గడతేర్తుమనియుఁ బ్రల్లదములాడ వానిమాటలకు భయంపడి కొన్ని పక్షులట్లే కానిండని తలయూఁచెను. ఇఁక మనకు సభ్యత్వము దొరకుననియు నిరంతరము పక్షులు తమకడకు వచ్చుచుం బోవుచునుండుననియు సందుదొరకినపుడెల్ల నిందుంగొన్నింటిఁ బట్టుకొని తృప్తిమీఱఁదిని గుట్టుగానుండవచ్చుననియు నాహారసంపాదనమునఁ గష్టము తప్పుననియు నెట్టులైనఁ బ్రయత్నించి సభ్యత్వమును సంపాదింపక తప్పదనియు నవి తీర్మానించుకొనియెను. అంతియ

గాక తమగోళ్ళఁజాపియుఁ గోఱలం గనబఱచియు మీసముల
మెలిపెట్టియు మా దెబ్బచూడుఁడని బెదరింపసాగెను. ఈ గ్రహ
చారము నెవ్వరితోఁ జెప్పుకొందుము స్వామీయని పక్షివర్యు
లెల్లరు విశేషించి సామాన్యపక్షులు భీతినొంది దినమొక్క
యేఁడుగాఁ గడపసాగెను. కొన్నియాహారమును గూడ మాని
కుందసాగెను. పిల్లులు తమజాతికంతయుఁ దెల్పి యెక్కడివార
క్కడనే యన్నింటిని లోఁబఱచుకొనక వలయునని హెచ్చరిం
చెను. వానరములునట్లే తమజాతిని హెచ్చరించెను. కలవిం
కములు లోనగుచిఱుతపక్షులవ్వానికి విశేషించి భయపడి
మిమ్మేమెన్నుకొందుమని ప్రార్థించుచు నెట్లువీని యాపత్తినుండి
తొలఁగుదుమా స్వామీ యని పరితపింప సాగెను.

తూర్పుపడమరలయందు దక్షిణోత్తరములయందు సభ్యు
ల నియమించు నేర్పాటులు సక్రమముగా నెఱవేఱ సాగెను.
మధ్యరాజ్యమున లెక్కలేని చిక్కులు కలుగసాగెను. జలపక్షు
లలోఁ జకోరము నన్నెన్నుకొనుఁడని ప్రకటించెను. స్థల
పక్షులలో శిశుపోషకము, పావురము, కలవింకము, కంకము
నిలిచెను. వానరమార్జాలములు పక్షులమే మనియుమమ్మెన్ను
కొనుఁడనియు నిలిచినవి. అందుఁ జకోరము తన యోగ్యత
నిట్లు ప్రకటించెను. నాజాతి మృగములేవియుఁ బరప్రాణములఁ
దీయునవి కావు. నాజాతికాహారము మృణాలనాళములు. నిర్మల
జలములు, నావంశము సదాచార సంపన్నము. నాపెద్దలిందే
చిరకాలము గడపి మరణించిరి. నాజన్మము మేనమామగారి
యింటనగుట నీదేశమే యని యసత్యమాడలేను గాని పెరిగిన
దీదేశముననే. ఈ దేశపు టాచారములు నాకెఱుకపడినవియే

గాని క్రొత్తవికావు, నన్ను మీరెన్నుకొని పంపినయెడలశక్తికిఁ దగినట్లు పాటుపడి యీదేశమున కుపకారముచేసెదను. మీ యుపకారమును మఱువను. పెక్కుసారులు నాయోగ్యత యిట్టిదని తెలుపుకొనుట మర్యాదకాదనియు దానికిఁబెద్దలు సమ్మతింపరనియు నావిశ్వాసము. ఇంతవఱకు మాజాతివలననేపక్షి జాతికి నష్టముగాని కష్టముగాని కలుగలేదు. వెన్నెలలో విహరించుజాతిమాది. ఇతరపక్షులకునిద్రాభంగముకూడగల్పించు పద్ధతిలేదు. ఫలములనురాల్చివృక్షములనుగూడఁ బాడుచేయు నలవాటునాకుఁగాకమాజాతికేలేదనిగట్టిగాఁజెప్పఁగలను. ఈవిషయములించుకగనో గొప్పగనోమీకును దెలిసియుండవచ్చును. విశేషించి తెలుపుకొనునంశములు లేవు. నాయీప్రార్థనమునంగీకరించి నన్ను నెన్నుకొనసమ్మతింతురనినమ్మియున్నాఁడను. అని పెక్కుతావులఁ దనవాక్యమూలమున నెల్లరకుం దెలియఁ జేసెను.

అంతట శిశుపోషక మిట్లు ప్రకటించెను. మాది యీ దేశమే. మాపూర్వులు, ఇప్పుడు మేము పరదేశమన్న నెట్టిదో యెఱుంగము. ఇందే పుట్టి యిందే గిట్టుట మాయాచారము. ఈ యొక్క విషయమే చాలును మీరు మమ్మెన్నికొనుట కని నమ్మెదము. ఇంతియగాక మాజాతియందుఁ బితృదేవతలకు దేవతలలో నిరుతెగలకు విశేషప్రీతి గలదు. మాతృప్తియే వారికిం దృప్తి యని వారె భావింతురు. ఇది చాలదా మేము దేవాంశ సంభూతుల మనుటకు. మఱియు మానవుల నిద్రాతమస్సునుండి మేలుకొలుపుట మావిధి. మావలెనే మఱి కొన్నిజాతులు గలవు గాని మేమా పనిఁ జేయఁబూనిన విరా

మముండదు. నేత్రసౌందర్యము ముఖము త్రిప్పుటలోఁ గల చమత్కారము మాకుఁ గలిగినట్లీలోకమున వేనికిని లేదని ప్రమాణముచేసి చెప్పఁగలము. మాసంగీతమునకు వంచక సంచయముగూడ మెచ్చుకొనుచుండునన నిఁకఁ దక్కినవారి మాట యిటఁ జెప్పనేటికి? పితరులకు దేవతలకు మాయందు విశ్వాసము గలదనుమాట యెక్కటియే మా మర్యాదను వే నోళ్ళఁ జాటుచున్నది. మాకాగ్రహము కలిగిన ముక్కుతోఁ బొడిచి యెట్టివారినైన నడఁపఁగలము. కావునఁ బౌరుషము కూడ మాకుం గలదనియు సంగీతసౌందర్యములు మాకుఁ గుల వృత్తులనియు భావింపవలయు. మే మొక్కసారి నోరుతెఱచి ధ్వనిచేసిన మా బలగమెల్లఁ గూడును. కావున సహాయ సంపదయు మా కెక్కువగాఁగలదు. గొప్పకార్యము మీకుండి నపుడు మాసాయము గోరవచ్చును. ఒక్కధ్వనిచేతనే యెల్లరకుఁ జెవుడుకల్గఁజేసి యేమియుఁ దోఁచక యుండఁ జేయఁగలము. కావున మాయం దిన్ని యోగ్యతలు కలవు. కనుక మమ్మే యెన్నుకొనుఁడని కోరుచున్నాము. అని ప్రక టించి దీనిని నానావృక్షములకడఁ దెల్పఁ దమ వారిం బంపెను. అవి విశేషించి ఘోషించెను.

అవ్వలఁ బారావతమిట్లు తనయోగ్యత నెల్లరకుం దెలి యఁజేసెను. మాజాతికిఁ బారావతమని పేరు. ఆ పేరునందే మహార్థముగలదని యెందఱో పెద్దలంగీకరించిరి. కంఠసౌందర్య గమనము చమత్కారము పైకెగురుట క్రిందవ్రాలుట యను నీమొదలగు చమత్కారవిద్యలలో మాకు సాటిఁయే. చిటి కెలో నెంతదూరమైనఁ బోయి మరలరాఁగల నేర్పు మాకు

గలదు. భూమిపైన మాజాతివారిం గూడి మేముతిరుగుచుండఁ
గా నాయొయ్యారమును జూచి యింద్రాదిదేవతలు మూర్ఛ
పోయిరన నింక మీమాటలెక్కయా? ఈవఱకే యీదేశమున
మాకు రాజనామము కలదు. మాసేనలు కలవింకములు.
పౌరుషమున నీమూఁడులోకముల వానికి సమానులు గలరా
యని దీపముపెట్టి వెదకినను లేరు. ఆబలములం గూడి మేము
జైత్రయాత్రకుఁ బ్రయత్నించిన నెల్లరు గడగడ లాడకుందు
రా? కావున మాయోగ్యతను విశేషించి పొగడుకొనము.
ఇతరులట్లు చేయుదురనియు మా కాగ్రహము కలదు. రాజ
కుటుంబమునకుఁ జేరినవారమని రాజ్యమును బాలించుచున్న
వారమని నమ్మి మమ్మే యెన్నుకొన్న మీకు భయమనునది
కలలోఁగూడఁ గలుగకయుండఁ గాపాడుదుమని వాగ్దానమొ
నరింతుము. చక్కఁగా నాలోచించి పనిచేయుఁడు. తరువాత
యోజించియు లాభములేదు. అని ప్రకటించెను.

తదనంతరము కలవింకము తనయోగ్యత నిట్లు ఘోషించెను. మాజాతి నిరంతరము పాటుపడునది. మమ్ముంజూచియే యితరులావిషయము నేర్చుకొనవలయును. మాకాగ్రహము కలిగినఁ గిచకిచధ్వనులచే నెట్టివారినైనఁ జీకాకుపఱుపఁజాలుదుము. ఆ పౌరుషముచేతనే యెల్లర లోఁబచుకొనఁ జాలుదుము, మాయాకారము కొలఁదిగానుండునని తలంపరాదు. సింగపుఁబిల్ల పెద్దదియా. మదపుటేనుఁగులజించి చెండాడుచుండుటవినమా రాజ్యపాలనమునకుఁ దగినది పౌరుషము, శత్రువుల లోఁబఱచుకొను నేర్పు, ఈ రెండును మాకుఁ గలవు. తక్కిన యోగ్యతలు మీకేల? కాఁబట్టి మమ్ము నెన్నుకొని పంపిన

మన దేశమునకు విశేషముమేలుగల్గఁజేయుదుము. విశేషించి బీరములుపల్కు నాచారము మాకులేదు. అని తనయోగ్య తను తనబంధువుల మూలమున నెల్లరకు విశదపఱచెను.

ఆవలఁ గంకపక్షినాయకుఁడు తనయోగ్యత నీరీతివిశద పఱచెను. మా జాతి గొప్పఁదనమును మేమే చెప్పుకొనుట మంచిదిగాదు. ఆకారముచేతను మీకెల్లస్పష్టము కావచ్చును. మేమెందుఁ దిరుగుచున్న నందుశవముల దుర్వాసనలుండవు. ఆ యొక్కయుపకారము చేతనే మావలన లోకమునకెట్టి మేలు గలదో తెలియలేదా? రాజ్యపాలనమునకిదియేలయందురేమో మాయాకారదర్శనముచేత నెల్లరుగడగడ వడఁకుదురు. మాకు ఱెక్కలు పెద్దవి. పక్షవాతమున దుమ్మురేఁగ దానిందప్పించు కొనఁజాలక శత్రువులందుఁ జిక్కుదురు- ఆశ్రమమున వారిం బొలియింతుము- మొన్నటిసభను గూర్చిన దెవరు? ఉపన్యసిం చిన దెవ్వరు? ఇంతటియుపకారము లోకమునకుఁ గల్గించినదెవ్వ రు? అప్పుడే మమ్మురాజుగాఁ జేసెదమని గరుత్మంతుఁడు బ్రతి మాలెను-ఆకార్యమున కంగీకరింపక ప్రజాసమ్మతముగానందుఁ గూర్చుండి రాజునకు మంచియాలోచనము చెప్పుటయే గౌర వమని యూహించితిమి- కావున మావలన మీకెల్లనింతటి గౌరవమును సంపాదించు పక్షిరాజ్యము స్థాపనమయ్యెనను కృతజ్ఞతం జూపవలయును-మాకాగ్రహమును గల్గింపక మమ్మె న్నుకొనుఁడు- అని కంకము తమజాతి పక్షులమూలమున యోగ్యత నెల్లరకుఁ దెలియఁజేసెను.

ఆ మీఁద వానరనాయకుఁడిట్లు తన ప్రతాపాదులను దెలియఁజేసెను- మాజాతి మానవజాతికిఁ బూర్వజాతి- మా

నుండియే మానవులేర్పడిరని దేశచరిత్రము నెఱింగినవారెల్ల రంగీకరించిరి- వాలముగలదు గావున నెగురఁగలము. ఆకాశ గమనము మీకుఁ గలదాయని యడుగుదురేమో- మాకులే దని మీకెట్లు తెలియును? ఏలమాతోడనంబరమున రాఁగూడ దని ప్రశ్నింతురేమో-మాజాతికిం జేరిన హనుమంతుఁడు శ్రీరా ముకార్యార్థము శతయోజనములు (800 మైళ్ళు) సముద్రము మీఁదఁ బోయెను-ఆయనకు గొప్పకీర్తిగల్గినది. మీరెల్ల నాస మయమునసభచేసి పూలహారము వైచి మీకీర్తికి భంగముగాక యుండవలయుఁగాన నికమీఁద వానరులాకాశమార్గమునఁ బోవరాదు అని నియమముచేసిరి. ఎట్టులైన నవసరముకల్గునే మోయని యాయలవాటు తప్పకయుండవలయునని చెట్టునుండి చెట్టున కెగురుచున్నాము. మేమును బక్షిజాతివారును సోద రులవంటివారమే- జ్ఞానశాస్త్రప్రకారమందఱము సమాను లమే. సోదరులమే. సాగరమును గట్టితిమి-ఇఁక దక్కినపనులు మాకులెక్కయా. మాశక్తులనన్నింటిని దెలుపఁబూనిన నెన్ని యోస్కాందపురాణములగును- రాజ్యపాలనమునకుఁ గావలసి నది బుద్ధిపౌరుషము. బుద్ధియందు బృహస్పతి మాకు సమా నుఁడు కాఁజాలక యిందుండినఁ గౌరవమని స్వర్గమున నున్నాఁ డు- తెలియునా. పౌరుషమునుండి రావణాసురునంత వానిని మావాలి చంకన నిమిడించుకొని నాలుగు సముద్రముల ముంచి యుప్పునీరుత్రావఁగా మూఁడు నెలలు పడిసెముపట్టి యల్లాడి తు దకుమాసుషేణునొద్ద నౌషధము పుచ్చుకొని కుదుర్చుకొనెను- మీరువినలేదా. వినకున్న వాల్మీకినడుగుఁడు. ఇట్టిమమ్ము మీ సోదరులమనియే తలంచి మెన్నుకొనుఁడు- మంచిమాటలు

చెప్పుసమయముగానఁ జెప్పితిమి. ఎన్నికొనకున్న మీగూండ్లు పిల్లలు మీవిగావు. చూడుఁడు మా దెబ్బ. మీరీయడవినుండఁ గలరా అని పలుభంగులఁ దమ యోగ్యతను వానరనాయకుఁడు తెల్పెను.

ఆమీఁద మార్జారరాజు తనప్రతాపము నిట్లు తెల్పుకొనును. పక్షి రాజ్యమున ననేకసభ్యపదవి నధివసింప నిలిచితిని. నా యోగ్యత నెల్లరుఁ గొనియాడుచున్న యదియేగాని క్రొత్తది గాదు. మాజాతికి చక్రవర్తి బిరుదు కలదు. వృక్షము లెక్కనలవాటు మాకు మెండు. మే మొక్కసారి కన్నులు విప్పి చూచిన నెల్లరు భయంపడుదురు. శిశువుల పోషించుటలో వానరబలముకన్న మేముమిన్నలమని యెన్నికంగాంచితిమి. ఎట్టి శత్రువునైనఁ బరిమార్చు శక్తి నఖముల మూలమునఁ గోఱల మూలమున మాకు గలదని మీకుఁ జెప్పనక్కఱలేదు. విశేష మొక్కండు కలదు. దానిం జెప్పక మానరాదు. గుడ్లగూబ లనుపక్షులు రాత్రులయందు వచ్చి పక్షులజంపుట యెల్లరెఱుంగుదురు కాదే. అవి మేమున్న తావునకు రాఁజాలవు. ఏలన రాత్రులయందు మాకు దృష్టిపాటవము మెండు. ఆ కారణమున వానరములకన్న మేమే పక్షుల రక్షింప నర్హులమగుదుము. ఇన్ని యోగ్యతలు మాయం దున్నందునను మేమును వాలసామ్యమును బట్టి లంఘించు నేర్పునుబట్టియుఁ బక్షిజాతిలోఁ జేర్పఁదగిన వారము కావునను మమ్మెన్నికొనిన యీరాజ్యమునకు విశేషించి పక్షులకు మహోపకారము గావింతుము. పక్షపాత మూని మమ్మెన్నికొనక పోయినచో

నావల విూదురవస్థను జూచుకొనుఁడు. అని మార్జారనాయకుఁడు తన ప్రతాపము దెల్పెను.

ఈరీతిగాఁ జకోరము, శిశుపోషకము, పారావతము, కలవింకము, వానరము, మార్జారమునను నివి యేడును సభ్యత్వమును గోరి తమతమ యోగ్యతలను దెల్పుకొనుచు నలుఁగడల నాయోగ్యతా ధ్వనుల నింపుచుఁ బరుగిడుచుఁ బౌరుషములు పల్కుచు మేమే యోగ్యుల మని సమ్మతింపఁ జేయుచుండెను. వీని యార్భాటములకు బక్షులు తల్లడిల్ల సాగెను. సాధుపక్షులు కొన్ని యిదేటికిఁ దెచ్చిపెట్టితిరి స్వామీయని భీతిల్లసాగెను. అందుఁ గంకము, వానరమార్జారములు దుష్టస్వభావము గలవనియు వానికి సాయముచేయక యున్న నేమి కీడుమూడునో యనియుఁ జాల పక్షులు భయంపడుచుండెను. శిశుపోషక పారావతకలవింకములు చకోరముం గూర్చి దూషింప వీలులేక యాపక్షి యీదేశమునఁ బుట్టినది కాదనియు నీవఱకే దక్షిణదేశమునుండి వచ్చినహంస మంత్రి యాయె ననియుఁ దూర్పుదేశమునుండి వచ్చి యిందుఁ బొట్టకూటికై చేరిన యీచకోరముకూడ సభ్యుఁడైనచో రాజ్యమంతయుఁ బరదేశవాసుల పాలగుననియు నట్లుగాక యుండ నసమర్థులము అయోగ్యులము నైనను మనలో నొక్కని నెన్నుకొనుట దేశాభిమానమనియు నంతమాత్రమైన బక్షపాతము చూపరాదా యనియు నందందుఁ గుసగుసలుగాఁ జెప్పుచుఁ దమలో నొక్కని నెన్నుకొనఁ బ్రోత్సహించు చుండెను. చకోరమునకుఁ బ్రతినిధులు లేరు. యోగ్యతాపక్షపాతు లగువారెల్లఁ జకోరము సాధువుగాన న్యాయముగా మాటలాడి

సాయము చేయుననియు నితరులకు భాధ కలుగఁ జేయదనియు దేశాభిమానము మంచిదియే గాని దేశమనఁగా మనమున్న తావేయనుకొనుట యల్పదృష్టి యనియుఁ జకోరమునేయెన్ను కొనుటన్యాయమనియు సాధుపక్షులాలోచించుచుండెను. కాని బహిరంగముగా నేమియన్నను దుష్టులవలన బాధకలుగునని మనసులోనే దాఁచుకొని యూరకుండెను. కొలఁది దినము లిట్లు గడచెను.

నియమితదినము సమీపించెను- నాలుగైదు దినముల వ్యవధియే కలదు-అత్తఱి శిశుపోషకముకంకము చెలరేఁగెను. తమపక్షమున మాటలాడి కార్యమును సాధింపఁగల పెద్దలను నియమించెను- నానాభంగులఁ బ్రయత్నింపుఁడని కట్టడిచేసెను- వారును న్యాయాన్యాయములం బరిశీలింపక యసత్యమునకించు కంతయేని జంకక పెద్దలువిన్న నేమనుకొందురో యని యను మానింపక పాపమునకు వెనుకంజవేయక తిరుగసాగిరి- చకోరమును నోటికివచ్చినట్లు తిట్టసాగిరి- తమనాయకుఁడే వినా యకుఁ డని బొగడసాగిరి- కొన్ని చోట్లకుంబోయి బెదరింపసా గిరి- మఱికొన్ని తావులకుం బోయి మానాయకు నెన్నుకొన్న మీకుద్యోగ మిప్పింతుమనియు లేకున్న నిపుడున్నరాజు మా బంధువులకు మిత్రుఁడు గావున నాతనితోఁ జెప్పి మిమ్మేమి చేయింతుమో తరువాతఁ దెలియఁగలదనియుఁ బల్కసాగిరి- మఱికొన్ని స్థలములకరిగి మనరాజు మీతో రహస్యముగాఁ జెప్పుమనెను- కంకనాయకునే యెన్నుకొని ప్రతినిధిగాఁ బంపుఁ డు- మీకు మహోపకార మొనర్చెదను- అని యిట్లు పల్కి నమ్మింపసాగిరి- ఇంకనుంగొన్ని వృక్షములకుం జని యోపక్షి

వర్యులారా! కంకమునకుఁ బెక్కుమంది మిత్రులుగలరు-మన యిప్పటి రాజగు సుదర్శనుఁడు కంకము గోరుచుండుమన్నఁ గోరుచుండును. తెమ్మన్న లేచును- ఏమిచెప్పిన నదిచేయును- కార్యదర్శిగాఁ బనిచేసినప్పుడు మంత్రిగానుండుమని బ్రతిమాలఁగా నాకు వలదని సర్వసమ్మతమగు నీయధికారమునుగోరి నిల్చెను- కాఁబట్టి మీరు సుఖముగా నుండవలయు ననికోరుదు రేని కంకనాయకు నెన్నికొనుఁ డని రహస్యము లుపదేశింపసాగెను- అందఱికంటె నీ కంకనాయకుని చారులే యధికసంఖ్యాకులుగా నుండిరి- భయపెట్టుట- లంచమిత్తుమని యాశపెట్టుట- అధికారమిప్పింతుమని నమ్మింపఁజేయుట- దండింతుమని తత్తఱపాటొందఁజేయుట వారిముఖ్యకార్యములై యుండెను- శిశుపోషక నాయకునిపక్షమున నల్పసంఖ్యగలవారు చారులై తిరుగసాగిరి-కలవింకము పారావతము తమలో దమరు మాటలాడుకొని కలిసి పనిచేయుచు నెవరికందు విజయము గల్గునని తోఁచునో వారినిల్పి రెండవవారు మానుకొననెంచిరి- ఆలోచింపఁగాఁ గంకపక్షి నాయకుఁడే తన కుపకారము కావలయునని వారిని నిల్పినట్లు నమ్మఁదగియున్నది- ఈరీతిగాఁ గార్యములు కొనసాగుచుండెను- మూఁడుదినములలో సమ్మతులు పంపవలయునను వార్త యెల్లరకుఁ దెలియవచ్చెను. ఆతరుణమున వారి యాకులత వర్ణింప నలవిగాక యుండెను.

---

# ఎనిమిదవ ప్రకరణము.

---

భగవంతుఁ డార్త బాంధవుఁడు. అనాథరక్షకుఁడు ఎవ్వరి సాయముం గోరకతననే యెవ్వరాశ్రయింతురో వారికి సాయ పడి సకలకష్టములఁ బోఁగొట్టి యూఱడిల్లఁ జేయుట పరమేశ్వ రుని తాత్పర్యము. ఆ యభిప్రాయము నామహానుభావుఁ డే కాలమందునను మార్చుకొనఁడు. అంతకుముందు తన్నాశ్ర యింపక యితరుల భూపతులు లోనగువారి నాశ్రయించినను ఎవ్వరివలనను గార్యము సిద్ధింపని కాలమునందైనఁ దనను సే వించి తలంచినంత రక్షింపవచ్చును. ఈయర్థమును-

మ. కలలోనఁదను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడైనట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలపం దోడనె మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్ సుని
శ్చలభక్తిన్ భజియించు వారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్

అని భాగవతపద్యము దృఢపఱచుచున్నది. ఆమహా త్ముఁడు కరుణాస్వరూపుఁడు భక్తసులభుఁడు. గర్వదూరుఁడు. దీనజన చింతామణి. బీదల పాలిటి కల్పవృక్షము. కావున నాభగవంతు నారాధించుట సులభమార్గము. అంత సులభ మార్గమున నొక తుచ్ఛమానవునిం గూడ నాశ్రయించి వాని కరుణసంపాదింప వలనుపడదు. ఆపరమేశ్వరు నాయడవి నొక్క ప్రాణియె నమ్మియుండెను. తక్కినప్రాణులనెల్ల నెందఱనో నమ్మి వారిమూలమునఁ దమకార్యము నెఱవేర్చుకొనఁ గోరి యుండెను.

అట్టి పరమేశు నాశ్రయించిన ప్రాణియే చకోరమని

పాతకులూహింపఁగలరు. అచాతకమునకు ననుచరులు పెక్కండ్రులేరు. కాని యొక్క గండుగోయిల మాత్రము సాయపడ నంగీకరించెను. చకోరమిట్లు కోకిలముతోఁ బలికెను.

చ. తెలుపకు తుచ్ఛభావములఁ దెల్లముగాఁగ నిజంబెయెల్లెడం
బలుకుము "చెప్పితప్పకుఁడు పాపమదేయనివచ్చఁజెప్పు" మే
కలుషమునైనఁజేయకుము గాదిలిమిత్రమ న్యాయమార్గమే
గెలిచిననోడినన్ మనకుఁ (గేవలసంశ్రయణీయమౌఁజుమీ.) ౧

మఱొక్కమాట వినుము.

శా. మేమేగెల్తుము వారలోడుదురు మా మిత్రంబులేయెల్లెడన్
ధీమంతుల్ ధనవంతులంచుఁబని సిద్ధింపంగనిచ్చారతిన్
భూమిఁగల్గుమనీషులెల్ల నగఁదెంపుంబూనిఘోషింపఁగా
నేమాడ్కిం దలపోయఁగాఁ జనదు లక్ష్మీశుండుదూరంబగున్. ౨

నీతికోవిదా! కోకిలవర్యా! విసుగునొందక మఱియొక్కమాట వినిపొమ్ము.

చ. ఖలులొకకొందఱొక్కగుమి గాఁ జరియింపక వారిఁగాంచి యే
బలుకులుగాని పల్కకుము ప్రల్లదముల్ పచరించినన్ "సరే
సలుపుఁడు కార్యసిద్ధికయి చక్కనియత్నము"టంచుమైత్రితోఁ
బలుకుము వారుతిట్టినను బల్కకుమా బదులొక్కమాటయేన్.

మిత్రమా! త్వరపడుదువేమో. ఇంకొక్కమాట నాలకింపుము. నీకుఁ దెలియనివి కావివ్వియని నేనెఱుంగుదు. పెద్దవాఁడను గావునసం జెప్పెదను.

ఉ. లంచములిత్తుమొక్కతఱి లాలనముల్ పచరించి యెట్టులో
వంచనలోఁగఁజేయుదుము వారకయొక్కతఱిన్ మఱేమనన్
బెంచినయీసుతోడ వెఱపింతుమఱొక్కటనంచు బింకముల్
గొంచకపల్కవారిఁగని క్రోధమునన్ బదులాడకుండుమా. ౪

అంతియగాదు.

చ. నినుఁగని వ్యాజమూని యొకనిం గనిఁదిట్టినయట్లు తిట్టినన్
మనమునఁగల్గునాగ్రహము మైకొనఁగాపదులల్లె తిట్లగాఁ
జనునదె పౌరుషంబనుచు స్వాంతమునం దలపోయ కెంతొశాం
తిని గొని యుండుమా మనల ధీరులు మెచ్చినఁ జాలునంతియే. ౫

ఇట్లు ప్రవర్తించిన మనపక్షము గెలుచునాయని సంశ
యింతు వేమో.

చ. కలదొకమాట సత్యమె జగంబుననిల్చు నసత్యమించుకే
నిలువఁగఁజాలదై ననిల నీచులధర్మము నాశ్రయించియే
గెలిచినయట్టులుబ్బుదురు గెల్పదిదుర్యశమిచ్చునం చెదం
దలఁపరుగాననీవు నన్నృతంబులుపల్కకుమా జయార్థివై. ౬

మఱొక్కమాట.

క. దేవానాంప్రియు లొక్కట
నేవొకాఱులువచింప నిందతయుమదిలోఁ
దావీయకుమా యీర్ష్యకుఁ
బోవంగాఁదోలునద్ది పూర్వసుకృతమున్. ౭

ఇట్టులైన నేనేమని చెప్పవలయు నందువేని నామతమిది

చ. వినయముతోడ సాధువుల బృందముగాంచి ప్రియంబు మీఱ నా
యనుఁగుసఖున్ జకోరమును యాచకుగాఁదలపోసి సభ్యుఁడై
చనియటమోజనల్ తెలుపఁ జాలెడునంచుఁ దలంతురేని మీ
యనుమతినిండు రిత్తపలుకొడకుఁడంచు వచింపుమాసఖా. ౮

నీవిట్లు ప్రార్థించునపుడు మఱికొంద ఱరుదెంచి స్వకా
ర్యము నెరవేర్చుకొనుటకుగాఁ బట్టుపట్టె.

తే. నిలిచెనభ్యర్థియై భాష నేర్వఁడతఁడు
మఱియుఁ బరదేశజనితుఁడు మాకునిదియె

జన్మభూమియటంచు నుత్సాహమడరఁ
బల్కుతటి సుంతయును మాఱు పల్కవలదు. ౯

సాధువిహంగములే యీప్రశ్నమునకు బదులుచెప్ప మాయన్న,

తే. కలదు నాకుఁ బ్రపంచవిజ్ఞానమింత
నీతిశాస్త్రంబు నెఱుఁగుదు భూతలేశ
సభను మెప్పింపఁ గలనంచు సఖుఁడు పలికె
నంచు వినయంబు మీఱఁగ నాఁడు మార్య. ౧౦

ఇట్టిమాటలాడిన మనమాట హర్షింపక వారల బీరములే నమ్మి నిన్నెన్నుకొనక యింకొక్కని నామశూన్యు నెన్నుకొన్న యెడల మనకుఁ బరాభవమేకదా. వారు చప్పటలు తట్టుచు గేలిచేసిన నోర్చుటెట్లు? అందు వేని.

మ. మతిమంతుల్ ధృతిమంతులొక్కతటి సమ్మానంబు మీఱంగ మీ
జతనంబుల్ ఫలియింపకున్ననుసరే సాధుప్రమోదంబుఁ గాం
చితిరేని జతనంబొనర్పఁ దగు జీ-చీయంచు సాధూత్తముల్
మతిఁ జింతంగనఁ జేయుమార్గమదె దుర్మార్గంబనంగాఁబడుణ్. ౧౧

క. అనిపల్కినదె విజయం
బనఁజను దుర్మార్గవిహిత మా నద్ధిఫలిం
చిన నపజయమనఁగాఁ దగు
ననియెంచి ప్రయత్నపరుఁడ వగుము ప్రియసఖా. ౧౨

అని యనేకభంగుల నీతులందెలిపి ప్రతిపక్షులేమన్న నోర్చుకొని బదులుపలుకక పరోక్షమున నే తూలనాడక మీ వార్తనెల్లరకుం దెలియం జెప్పుమనిపంపెను.

ఆపిక మామాటలకుం గడుంగడు నానందించి చకోరక మింతటి నీతిశాస్త్రమెఱుఁగుటకు నుబ్బుచు నిట్లు ప్రయత్నిం

చిన గెలుపొందఁగలమా యనిసంశయించుచుఁ దానేమియుఁ
జకోరకము నాజ్ఞనుల్లంఘింపఁ బూనక యెల్లతావులకుం జని
యార్యోత్తములారా! రాజాస్థానమున సభ్యత్వమున కీదేశము
పక్షమునఁ జకోరకము నిలిచెను. ఆయన సుగుణములు మీఱె
ఱుంగనివికావు. విశేషించి పలుకనక్కఱలేదు. మీరెల్లమాన
సమున నాతని నంగీకరించితి రేని సమ్మతులనిండు. ఇతరులకు
మాటయిచ్చియుండిననామాటఁ దెల్పుఁడు.సంతోషించెద. నా
మిత్రునకు మీసమ్మతుల నిచ్చునెడల నిత్తుమనుఁడు. ఆనందిం
చెద. ఇంకను దీర్మానించుకొనకయున్న నామాటఁదెల్పుఁడు.
సమ్మతించెద. మోమోటమికిఁ జిక్కిసమ్మతించిన యట్లు నటిం
చి యవ్వల మోసముచేయకుఁడు. అది మీమర్యాదకే హాని
గల్పించును. అని ప్రార్థించుచు నిట్టే యామధ్యదేశమునం గల
పతత్రిస్థానములకుంబోయి దెల్పుచు సరస్సునకుంబోయి చకో
రకమున కావార్త యెఱింగించెను. సర్వసమ్మతుఁడవైతివనియు
హెచ్చరించెను.

కంకమంతటఁ దనపక్షమున నెల్లతావుల స్వచారిత్ర
మునువెల్లడింపఁగలవారలఁ గొందఱ నియమించెను. తానంతకు
ముందే రోగమున బాధపడియుండుట కొంత విశ్రాంతిగొన
నుంకించియుండుట కారణములుగా వారినే పంపెను. వారి
యందుఁ బ్రధానులు బోరువ, దివాంధము (గుడ్లగూబ) లకు
ముకి, గ్రుడ్డిగ్రద్ద, నక్కయనువారు- భోజనపదార్థ విషయ
మున నక్కయుఁ గంకమునకు మిత్రముగావున నేనును బని
చేసెదనని ప్రయాణమయ్యెను. వారు బయలుదేరునప్పుడు కం
కమువారిం బిలిచి ప్రియమిత్రములారా! ద్రవ్యమునకుం బ్రా

ల్మాలక, శ్రమముల లెక్కింపక, మర్యాదం బాటింపక, యప కీర్తిని లెక్కచేయక యేవిధమున నైన నాకు విజయముగల్గ బ్రయత్నింపుఁడు. సాధువులు చీయననిండు, ధర్మము మనపక్ష మునకు విముఖతచూపనిండు. ఎవ్వరేమననిండు. ఆదూషణ ముల లెక్కింపక నయమున భయమునఁ బ్రయత్నము చేయుఁ డు. రహస్యముగా మీకేమధికారము కావలసినను రాజునాకు మిత్రుఁడని తెల్పి క్షణమాత్రమున నిప్పింతునని యాశఁగొలు పుఁడు. ఆ యాశలేనివారల నొంటరిగా నున్నతఱి భయపెట్టి జాగ్రత్తగానుండుఁడని యడలునట్లు చేయుఁడు- రోగమున బాధపడువారి కడకుంబోయి యేకాంతమున మాటలాడుచు మీఁదఁబడియైన నొప్పింపుఁడు- అప్పటికి సమ్మతింపకయున్న నేమేనిచేయుఁడు. ఇది కార్యము, ఇదియకార్యము, అని పాటిం పక పలువిధములఁ బ్రయత్నములు సలిపి ప్రల్లదములాడి కొన్ని తావులను, బాదములం బట్టుకొని కొన్ని తావులను, భయపెట్టి కొన్ని తావులను, నిష్ఠురములాడి కొన్నిస్థలములను, ద్రవ్యమి చ్చియు, నధికారమిప్పింతుమని యాసఁగొలిపియు మఱికొన్ని తావులను నాకు సమ్మతులు వచ్చునట్లు ప్రయత్నింపవలయు. ఇంక మీకెఱిఁగింపందగు విషయములులేవు. అని పలుకనక్క లరాయండిట్లు బీరములు పలికెను. చూడునాదెబ్బ. చకోర మున కొక్క సమ్మతియేని రాకయుండఁజేసి నీకు విజయమును గల్గించెద. నామోసములకు లోఁబడని వారునుగలరా అని నమ్మఁబలికెను.

గుడ్లగూబయు నేను బగటిపూటఁ దిరుగలేకున్న నస్త మయముకాఁగా నెల్లవారు నిద్రింపకముందే ప్రతిచెట్టునకుం

బోయి నేత్రగోళములం ద్రిప్పి యగ్నికణములఁ గ్రక్కించి భయ పెట్టెద. తెల్లవాఱు నంతదనుక మీరు బ్రదికియుండ బ్రయ త్నింపుఁడు అని త్వరపెట్టెదనని పంతములాడెను. బోరువయు నింతయేల? నేనొక్కమాఱు గట్టిగాఁ గన్నులు తెఱచి చూచి న నన్నిపక్షులు వడంకకుండునా. పక్షములఁ గదలించి భూమి నుండి దుమ్ము నెగయించి కన్నులు రాకయుండఁ జేయ కూరక పోనిత్తునాయని ప్రతాపవచనములు పల్కెను. లకుముకిలేచి యారా! చకోరమున కింత యవివేకమేల వచ్చెను- తాఁబెద్ద యని యేమెల్లఁ బలుకుచుండ నూరకుండరాదా. పిన్నవారల కివన్నియు వదలవలయును గాని పెద్దవారలకివేల? ఎట్టులైనను శ్రమంపడిద్రవ్యమునకువ్యయమైనను గార్యమును సాధించెదను. ద్రవ్యమునకు వెనుదీయు సమయముకాదు- ఆవలనుప్పమ్మి కొని బ్రదుకవచ్చును. ఈకార్యమును సాధించి మఱిమాట లాడుదము. నీకుండిన స్థిరచరరూపమగు స్వత్వమును దెగనమ్మి యైన నీపనిసాధింపఁ బ్రయత్నింపుము. ఇదియే నాచెప్పుమాట అని గంభీరోపన్యాసము గావించెను- పిదపగ్రుడ్డిగ్రద్దముఁదన శక్తినిబ్రకటింపఁదలంచియిట్లనియె. మావాఁడే సేనాధిపతి- తెలి యునా. అనేక వీరభటులాయనయొద్దఁ గలరు. ఒక్కసారి వారి నందఱం గొనివచ్చి మీగూండ్లు నిర్మూలింతును. కావున జాగ్ర త్తగానుండుఁడని భయపెట్టుదును- నామాట మీఱఁజాలువా డుండునా- ఎల్లరు నామాటయన్న గడగడలాడుదురు - గ్రుడ్డి గ్రద్దయని నాకు నామధేయము మాత్రమే కలదుగాని కన్ను లున్నవారు కూడ నావలెఁ బనిచేయఁజాలరు. ఒక్కయదలిం పునకు నెట్టివారైన వడఁకుదురు- ఏవిధముననైన మీపక్షము

జయమందఁ జేయుదురని మహావాక్కులంబలికి తన పరాక్రమ
మును నెఱపెను- ఇట్లు కలవింకమిత్రములు ప్రల్లదములాడి
తమయనుంగుఁ జెలికాని యానందాంబుధి నోలలాడించెను.

పిదప శిశుపోషకము పావురము కలవింకము తమతమ
యనుంగుసఖుల మూలమునఁ దమతమ యోగ్యతాతిశయము
లనెల్ల కడలఁ జాటఁజేసిరి. వానరమార్జారములు తమ వారిని
బంపితమ ప్రసిద్ధిని జేయఁబూను కార్యమును దెలియఁజేసిరి. పరస్ప
ర జయేచ్ఛలఁ బ్రయత్నములు సాగించుచుండిరి. అంతటఁ గంక
పక్షిరాజు మిత్రులు పెక్కుతావుల కరిగి తమకు సమ్మతులు
రావని యనుమానించి యిట్లు వంచనసేయ నారంభించిరి. మ
ఱ్ఱిచెట్టుమీఁదఁ బెక్కుపక్షు లుండెను. వారెల్లఁ జకోరము
యోగ్యతనెఱుంగుదు గావున నాతని యనుచరుఁడు విశేషించి
తెలుపకయున్నను హృదయపూర్వకముగా సమ్మతుల నొసంగఁ
బూనియే యుండెను. ఆపక్షి కదంబమున నందె మూవురుచకో
రశిష్యులు గలరు. వారు తొలుదొలుతఁ గలవింకమును నిల్పిన
కారణమునఁ జకోరమునకు సాయపడ వీలగునో కాదో యని
యెంచుచుండిరి. కాని కలవింకమునకు విజయముగలుగుట సం
శయమని తోఁచినతఱిఁ జకోరమునకు సాయపడ నిశ్చయించి
యుండిరి. ఆసమయమున నొక్కనాఁడుకంకానుచరులు తమనా
యకు సీడ్చుకొనిపోయి యా మ్రానిమీఁద నుండి పక్షులతో
నార్యులారా ! మీరొక్క విషయము నాలోచింపుఁడు. కల
వింకము నెన్నుకొనఁ బ్రయత్నించితిరి గదా. ఇపుడు కలవింక
మునకు సాయము తక్కువయనీ స్పష్టమయ్యెను. మాయెఱింగి
నంతవట్టు మాకే యందఱు తోడ్పాటుచూపిరి. ఇట్టి యిక్కట్టు

న మీరు కలవింకమునకుఁ దోడ్పడియు లాభమేమి? లాభము
లేని సమయమున సహాయముచేసినను నిరర్థకమే కదా. మీ
సహాయ మమూల్యము. అది నిరర్థకమగుట మాకుఁ దెలిసిన
చోఁ జింతకలుగక మానదు. కావునఁ గలవింకమును నిలిపి వే
యుదుము. మీకు మమ్మే యెన్నికొనుఁడు. ఇట్లే పారావత
మును శిశుపోషకమును గూడ నిలుపుదుము. వారిమిత్రులంద
ఱును మమ్మేయెన్నుకొంద మని వాగ్దానము చేసిరి. కావున
మీరును మీ సమ్మతులకుఁ బాత్రునిగా మామిత్రుని గలవిం
కమును సభ్యునిగా నెన్నుకొనుఁడు అని యెన్నియో మాయ
లుపన్ని వలలోవేసికొనఁ బ్రయత్నించెను.

కాని యాపక్షివర్యులందఱు రహస్యముగా నాలోచింప
సాగిరి. తొలుత వీరిమాటలు నిజములని నమ్మితిమి. ఇపుడిపుడు
చూడఁగా మోసముచేయు వారి వాక్కులవలెనున్నవి. అంద
ఱు సమ్మతులుకై కొనఁగోరి మొదట తమకది సాధ్యముకాక
యుండుటెఱింగి కలవింకపారావతశిశుపోషకములసభ్యర్థులుగా
నిల్పి వారికి వాగ్దానము చేసి వారి సమ్మతులఁ దుదకుఁ
వారినినిల్పి తమకే సంపాదింపఁగోరి యీ పన్నుగడ నల్లినట్లు
తోఁచెడిని. ఇంతమోసముసాగునని యెఱుంగమైతిమి. చకోర
మీవిషయమునఁ దొలుతటి నుండి యొక్కరీతిగాఁ బల్కు
చున్నది. మోసమింతయుఁ గానరాదు. సత్యము నాపక్షివ
ర్యుఁడు నమ్మియున్నట్లు స్పష్టము. ఈకంకము సహస్రధా
మా యోపాయములు పన్నినట్లు నమ్మవలయును. ఇంతలో ని
న్నిమాటలా. కంకానుచరులు పరమవంచకులు. సత్యము వీరి
యందించుకంతయుఁ గనంబడదు. కావున నిట్టివంచకుని రా

జాస్థానమునకుం బంపినయెడలఁ బ్రభుత్వము చెడిపోవును. కనుకఁ జకోరము నంగీకరింతమని గట్టిగా నూహించిరి.

తరువాతఁ గలవింక పారావత శిశుపోషకములు తమ తమ మిత్రులకడ కరిగి మామిత్రులెల్లఁ గంకపక్షిరాజు నంగీకరించిరి. మేమేమి చేయఁగలము? మీరు మాయందు విశ్వాసము గలవారలని యెఱుంగుదుము. మీసమ్మతులు ఫలము నొందవలయును గాని నిష్ఫలముగాఁ జెడిపోవరాదు. కనుకఁ గంగనాయకు నంగీకరించి సభ్యునిగాఁ బంప నంగీకరింపుఁడు. మరల నెన్నికలు రాఁగా మేము నిలిచి గెలుపొంది మీకరుణకుఁ బాత్రుల మగుదుము. మాయందు మీకుఁ గల విశ్వాసము పొల్లుపోవదని నమ్మెదము- మాకుమాఱుగఁ గంకనాయకునిం దలంచి మీసమ్మతుల నిల్చి గెలుపొందఁజేసి కీర్తినిగడించి రాజ్యమునకు మేలు సమకూర్పుఁడు- ఇదియే మాప్రార్థనమని యెల్లతావుల నుడువ వారిమాటల నాలకించి తెన్నుగ నాలోచించి కర్తవ్య మూహించి యిదియంతయు మోసమని గ్రహించి కంకనాయకుని వ్యాపారము తలంచి యంతకంటె నన్యాయము వేఱొకఁ డుండదని నిశ్చయించి మదులయందు తెన్నుపరికించి జనహితుఁడు చకోరనాయకుఁడని కడుం కడు విమర్శించి యాతనికిఁ దమసమ్మతుల నొసంగుట సమంచితమని తలపోసి యావిషయము కలవింకాదులకుం దెలుపక "సమయమున నాలోచింతుము- ఇపుడేల యీచింత? మీరేగుఁడు- మేము కర్తవ్య మెఱుంగుదుము-" అని సాగనంపి జనము నకు మంచినిగోరు నాధీమంతునే యెన్నుకొనవలయు ననియు నితరులు సమ్మతు లొసంగిన నొసంగకున్నను మన

మేమో యాతనినే సమ్మతులకుఁ బాత్రునిగాఁ జేయవలయు నని యుఁ దీర్మానించుకొనిరెను- ఒకప్పు డోడినను సత్యము నకు సాయము చేసిన పుణ్యము వచ్చుననియు, నసత్యమే గెలిచినచో "పాపీ చిరాయుః" అన్న సామెత సార్థకమయ్యెనని తలంపఁ జనుననియు వారు తలంచి తమతమ పనుల నాయ త్తులై రి.

## — తొమ్మిదవ ప్రకరణము. —

కరుణకుఁబుట్టినిల్లగు భగవంతుఁడు శ్రీనివాసుఁడు సత్య మునే కాపాడుచుండును. దానంగొంత నొందువారికి జ్ఞాన ము నొసంగి సంతుష్టులనుగా నొనరించును. అంతియ కాని యన్యాయప్రవృత్తిని గల్గించియైన గెలిపింపఁబూనఁడు. జయమ నఁగా సజ్జనుల యాదృతికిం బాత్రమగునదియే. అట్టిది కాదేని దాని కపజయమనియే పేరు. లోకమున ద్రవ్యార్జనమునకుఁ బెక్కుమార్గములు కలవు. కాని చోరత్వము విజయమును గాంచునా. ఏనాటికిం గాంచదు. కొలఁది దినములావృత్తిం గైకొనువారు మిట్టిపడుచుండినను వారపకీర్తికిం బాత్రులేయగు చుఁ దమమదులయందుఁ గొంతఁగాంచుచునే యుందురు. అంతియ కాని హాయిగా గుండెలపైని జేయివైచుకొని నిదురింప జాలరు. అట్టి దుర్వ్యవసాయమును జేయని వారోడినను మన స్తృప్తిగలిగి సజ్జనుల కసూయఁగల్గింపని వారమైతిమి అంతియ చాలు అని సుఖముందురు. అన్యాయార్జితవిత్తము చిరకా లము నిలువఁజాలదు. నిలిచినంత కాలము సుఖమొసంగఁ జాలదు. అంతియగాక యాకొలఁది కాలముననే సకలదుఃఖ

ముల పాల్సేయును. తలవంపులు గల్గించును- ఇట్లగుట భగవ
దిచ్ఛచేతనే ఆయిచ్ఛయుఁ గర్మాధీనముగానుండునని కొందఱు
పెద్దలందురు. యోజించిన నట్లే యగపడును. కావున జయాపజ
యములు కర్మాయత్తములు, పరమేశ్వరుఁడన్నింటిని జూచుచు
వినోదించుచుండును. కాఁబట్టియే దేవునకుసర్వసాక్షియని పేరు.
ఆ దేవుని సర్వదాభజించువారు విజయానందము ననుభవింతురు.
దుష్ప్రయత్నములు తాత్కాలిక సుఖమునిచ్చినను మానవుని
వరుసగా నశింపఁజేయుననుట సత్యమని యందఱంగీకరింతు
రనియే నాదృఢవిశ్వాసము.

పక్షిగేహముల సంకులసమరమెక్కుడయ్యెను. ఏమూ
లఁజూచినను గలహములే. గుసగుసలే. మోసపుమాటలే ఎ
వ్వరికి నేయూహలు తోఁపకయుండ గంభీరోపన్యాసములు.
స్వపక్షభూషణము పరపక్షనింద ఈ మొదలగు విషయములతోఁ
గులాయవృక్షములు ప్రతిధ్వనించుచుండెను. కంకపక్షి రాజుప
క్షము వారుప్రల్లదము లాడుటయుఁగాళ్ళపైఁబడిప్రార్థించుటయు
భయపెట్టుటయు, రాజమంత్రులకుం దెల్పి యుద్యోగములు
లోనగునవి యిప్పింతుమని యాశపెట్టుటయు, నింక ననేకవి
షయములం బలుకుటయుఁదుదకుఁ దిట్టుట కొట్టుట యనుమహా
కార్యములు చేయువఱకు: జేయసాగిరి. కొందఱు భీతిల్లియు,
మఱికొందఱు బాధ తప్పినం జాలుననియు, నింకను గొందఱు
మనకేల యీయుద్యమమనియుఁ బెక్కువిధములఁ గలవిల
పాటొందసాగిరి. కొందఱు సాధువులు మనకేల యీవివా
దము యూరకున్న నుండనీయమిఁ జింతిల్లసాగిరి, పెక్కండ్రు
కంకమునకే జయముగల్గఁ బ్రసాదింతుమని యుచ్చైర్నాద

మునఁ బలుకసాగిరి. మానసమున దీని కపకారముగల్గుఁ గాక యనికోరిరి. తమసమ్మతిని జకోరమునకే ప్రసాదింప నిశ్చయించుకొనిరి. కాని కంకరాజు, వానియనుచరులు తదేక దీక్షతోఁ బ్రయత్నముచేయుచుండిరి. ప్రతి పక్షివర్యుఁడును సమ్మతినొసంగు గుఱుతులం బంపఁగా వానింగైకొనియిడుకొనిరి. ఎప్పు డీపీడనివర్తించునా యని తహతహలాడుచుండిరి. ఆరేయియెట్లోగడచెను. వ్యవధి రెండు దినములుండెను. కంకానుచరులు కాలుగాలిన పిల్లులవలెఁ దిరుగసాగిరి. వారి యుపన్యాసముల కాయడవియంతయుఁ బ్రతిధ్వనించుచుండెను. వారింగూడి కలవింకానుచరులు, పారావతపక్షము వారు, శిశుపోషకబంధువులు మానాయకులు మానఁకొనిరి. కాన మాయందుఁగల ప్రీతిచేతఁ గంకనాయకునే యెన్నుకొనుఁడని యుద్ఘోషింప సాగిరి. మార్జారమిత్రులు వానరానుచరులు బెదరించుచుఁ బండ్లిగిలించుచుఁ జూడుఁడు మాదెబ్బ యని బీరములాడుచుఁ దిరుగసాగిరి. ఆయుద్ధతికి, నాయార్భాటకమునకు, నాయుపన్యాసములకు, నాభయప్రదవాగ్ధోరణులకు, నాకపట వ్యాపారములకు, నాయాశాజనక వాగ్దానములకు నాయడవి యెక్కటియే యననేల? కొండలు ప్రతిధ్వనింప సాగెను.

ఒక్కతరువరమున నొకసాధుపతంగము జబ్బుపడి యాకటఁగృశించి కదలలేక పరుండెను. దాని యునికి నెఱింగి కంకానుచరు లార్వురు పరుగిడిరి. అది లేవఁజాలక చేసన్న వారినిగూరుచుండ నియోగించెను. మేము కూరుచుండు నవకాశముగలవారముకాము. ఆమర్యాదకు విశ్రాంతిగొని

మాటలాడుటకుఁ జకోరమిత్రుఁడు పికమరుదెంచును. మేముద్ధతులము. నీసమ్మతిని మాకంకరాజున కిమ్ము. అని బలవంతముచేయఁగా నాపక్షి యార్యులారా! కదలఁజాలను. రేపు యోచించి పంపుకొనియెదను. మిమ్ము మఱువనని యెంతయో వినయమున విన్నవించెను. ఆమాటల కత్యాగ్రహమునఁ గౌశికప్రభృతులు లేచి కొట్టుదుము ఎముకలు పిండిచేయుదుము జాగ్రత్త మరల రమ్మనెదవా మాయోగ్యతలేమి? నీయోగ్యతయేమి? అని పైఁబడనుంకించి యెట్లో దానింగైకొని పాఱిపోయిరి. ఆపక్షి యా యుద్ధతింగాంచి యెంతయు నచ్చెరువంది యక్కటా! ఈసమ్మతులు మనస్సమ్మతములుగావు. కాన నెట్లు సమ్మతులనంబడును? ఇట్టివారందుఁ జేరినఁ గల్గు లాభమేమి? అని పలుభంగులం బొగిలి చక్రవాక మిత్రుఁడు కనంబడ నిట్టులాయెనే అని చెప్పి యంగలార్చెను. ఆర్యా! పోయినదానికి వగవకుము. మావలన నీకట్టి బాధకల్గకుండుటయే మాకు గౌరవమని తలంతుమని వేఱొండుతావునకుం బోయెను.

ఇట్లుద్ధతులగు కంకపక్షినాయకు ననుచరులు పెక్కుతావులఁ బెక్కురీతులఁ దమబాహుబలము, జూపియు వాగ్ధోరణులఁ గనఁబఱచియు, సాహసమును బ్రదర్శించియు గర్వమును గనఁబడంజేసియుఁ దులువతనమును వెల్లడించియు నెల్లరమానసములఁ జీకాకుపఱచి తమపని సాధించుకొనం జూచుచుండిరి. కానిపక్షులెల్లఁ దమసమ్మతులఁ జకోరమునకే యొసంగుచు దానిం గనఁబడక యుండఁజేయుచు, వారికే సమ్మతులనిచ్చిన చందమును గనఁబఱచుచునుండిరి. కొన్ని

స్థలములనున్న పక్షులు వారిమాటలకు బేలుపోయి లాభము రాఁగలదనియో, వారి మైత్రిబాటించియో తమసమ్మతుల నొసంగి వారినానందింపఁ జేయుచుండిరి. కోకిల మాదార్జన్య మునుగాంచి మదిఁదపించుచు నట్టివారి చెంతకై నంబోవక తొలంగిపోవుచు సాధువుల కడకరిగి వారి యాదృతికిఁ బాత్ర మగుచు నట్టివారిసమ్మతియే చాలునని తృప్తిపడుచుఁ దిరుగు చుండెను. కంకపక్షినాథు ననుచరులు బాహుబలము గల వారు గావున సాహసించుచు నపకీర్తికిం బాత్రులగుచుండిరి.

నియమితదినములు పూర్తికావచ్చెను. కంకనాయకుని కొక్క క్షణము మనస్సమ్మోదము. మఱుక్షణమున సంకటము గలుగుచుండెను. ఎవ్వరు వంచించిరో తెలిసికొనఁ దరముగా కుండుటయే యీయవస్థకు హేతువు. కొందఱు సాధువుల వలె మీపక్షమున మేముందుమని మాటలాడుచు నింకొకరికిఁ దమసమ్మతులనిచ్చుచుండిరి. అంతియగాక మీకే యిచ్చితి మని పలుకుచు లేని యభిమానమును గనఁబఱచుచుండిరి. వారి ఉక్కుమాటల నమ్మి తనకే జయము గలుగునని గంపె డాసతో నుండెను. మఱికొందఱు వచ్చి వారు శత్రుపక్షమునఁ జేరినవారు. పైకిమాటలాడు చున్నారని తెలుపఁగా దుఃఖ పడుచుండెను. తాను సజ్జనులని భావించిన వారందఱు దుర్జను లగుచున్నవారే యని వెతనొందసాగెను. ఎవ్వరి నమ్మెదు స్వామీయని పరితపింప నారంభించెను. ఇట్లు కంకము తదను చరులు తమరొనరించిన కృత్రిమోపాయములచేఁ దమరి నెల్ల వారు నమ్మరాని యట్లైరి.

ఇఁకఁ జకోరముగతి నించుక విచారింతము. భగవం

తుని నమ్మి డాంబికులవలెఁ బ్రల్లదములాడక మర్యాదగా
మాటలాడుచు నితరులను వలదని చెప్పెదను. మీసమ్మతుల
నాకేఁ బ్రసాదింపుఁడని వేఁడక సజ్జనభావమూని జయాపజయము
లయందు సమతగలిగియుండెను. కావునఁ గంకముఖ్యుల వలెఁ
గలవిలపాటొందక నెమ్మదినుండెను. కోకిలముకూడ మిత్రుని
యుపదేశమును నమ్మి మర్యాద నించుకయే నతిక్రమింపక
తిరుగుచుండెను. మఱియుఁ గంకరాజానుచరులు తన్ను నిందిం
చినను కనఁబడినప్పుడెల్లఁ గేరడములాడినను, మీసఖుఁడు
గెలుచుట కలలోనివార్త, చూడు నీమిత్రుని కొక్కఁడేనిసమ్మ
తినీయక యుండఁజేసితిమని గోషోక్తులాడినను బదులు చెప్పక
వారినీసున దూషింపక జయమైనఁ గానిండు అపజయమైనఁ
గానిండు అని శాంతముగా మాటలాడుచు నుండెను.

అంతఁ గడపటిదినమున రాజానుచరులగు శుకనాయకు
లరుదెంచి యందఱొసంగిన సమ్మతులం గొని చనిరి. నానా
దిక్కులనుండి వానిం దెచ్చుటయే వానికి మహాభారమయ్యెను.
సాధునగాకములన్నియు నెవరుగెలుతురో చూతమని యూర
కుండక సత్యము జయించుఁగాకయని ప్రార్థించుచుండిరి. చకోర
పక్షమున విజయము గల్గిన భరింపవచ్చును గాని కంకపక్షము
జయించిన నిఁక వారి యార్భాటములకుఁ దాళఁజాలమని
యూహింపసాగిరి. ఇంతలో శిశుపోషక మరుదెంచి కొందఱు
మాటలాడుచుండఁగా నిదె మాయుత్సవమరుదెంచెను. మీ
రెల్లనందుఁ బాల్గొనవలయును. చకోరము నింటికిం బోయి
మహోత్సవము నెఱిగించి ప్రార్థించినట్లు నటించి తిరస్కరించి
వత్తము. ఇఁక నెన్నటికైన నది యీపదవికి నిలువకయుండ

బుద్ధిచెప్పవలయునని మాయూహ. దీనికి మీరేమందురు? అని గట్టిగా బ్రశ్నించి వారు బదులిడక ముందే పరుగెత్తి పోయెను. ఇదంతయు మూర్ఖుల ప్రయత్నముగానున్నది. పాపము! సాధుచకోరను దిరస్కరించుట వీరికి క్షేమముగాదు. అంతియగాక చెడుగు గల్గును అని పలుకుచు నేమగునో యని తొట్టిమట్టిచెట్టుకడ కరిగిరి.

అభ్యర్థుల ప్రతినిధులు తమతమ పీఠముల నలంకరించి యుండిరి. రాజగు సుదర్శనుఁడు సింహాసన మలంకరించెను. చారుమతి మంత్రికర్త్వమగు పీఠమునఁ గూరుచుండెను. తక్కుంగల యుద్యోగులును బెద్దలు నుచితాసనముల నుండిరి. శుకములు లెక్కపెట్టుచుండెను. కలవింకప్రతినిధు లార్భాట ములు చేయసాగఁగా రాజానుమతిని మంత్రి యధికప్రసంగము చేసిన రాజాజ్ఞ ననుసరించి మీకుఁ దగినశిక్ష విధింపఁబడును నోరుమూసికొని యూరకుండఁడు అని హెచ్చరింప నోరు మూసి యూరకుండిరి. పికమూరక చూచుచుండెను. లెక్క పెట్టగాఁ జకోరమున కధికసంఖ్యగల సమ్మతులు కనంబడియె. కంకమునకుఁ గొన్ని తక్కువగాఁ గనంబడియెను. ఎల్లరువిన మంత్రి లేచి మధ్యరాజ్యప్రతినిధిగాఁ జకోరక మెన్నుకొనఁ బడియెను అని గట్టిగాఁ బల్కెను. ఎల్లవారు నానందించి కర తాళధ్వనులు చేయ నుంకించి యుండఁ గోకిలము లేచి మహా శయులారా! ఒక్కమనవి గలదు. అది నామిత్రుఁడు మనవి చేయమన్నదియే. కానఁ జిత్తగింపుఁ డనఁగా గోలాహల మడంగెను. పికం బిట్లనియె.

క. గెలుచుట యోడుట యను నివి
విలాసములుగాని వేఱు విధములు కావో
లలిత గుణాకరులారా
తెలియుం డిదె శ్రద్ధమీఱ దీని విధం బౌ.

తే. ఒకరి నొకరు ద్వేషించుట యొప్ప దెపుడు
దేశమునకును భాషకు దీనతఁ బెడ
బాపుటకె యందఱును దోడు పడఁగ వలయు
దానికే కద యిట్టి యత్నమిపు డయ్యె.

కం. పరదేశవాసుఁ డితఁ డని
సరిరాఁ డీదేశవాసి జనున కనుచు నె
త్తరుణమున నైన ననరా
దరయ సద్గుణమె గ్రాహ్యమగు బుధులారా.

చ. సలిపెడు యత్నమందుఁ గడు జాణతనంబున మాటలాడఁగా
వలయును గాని యీసుమది వర్ధిలఁ జేయుచుఁ దిట్టుచున్ సభా
స్థలమునఁ దోఁచినట్టు లనృతంబులు పల్కుట మేలు గాదు గాఁ
దులువలటంచు సాధువితతుల్ తలపోయుట ఖ్యాతి యౌనొకో.

చం. తెలిపెద నొక్కమాట కడు ధీరతఁ గార్యము న్యాయరీతిగా
ఫలమును బొందఁ జేయుటయె పాడి మఱొక్కవిధంబు జెల్లదీ
యిల సతతంబు ఖ్యాతిగను నెంతయు మేలగుఁ గాని దుర్యశం
బులఁ గనుటొక్క లాభమనఁ బోలునె సోదరులార యెన్నఁడీ.

చం. ఒకరిని నీచుఁడంచు సుగుణోత్తరుఁ డెట్లగునంచుఁ బల్కుచున్
వికటముగాఁ బ్రయత్నముల వేయి విధంబులఁ జేయుచుం దమున్
బ్రకటగుణాభిరాములుగఁ బ్రస్తుతి చేసికొనంగ నవ్వరే
సకలగుణైకధాములగు సజ్జనులింత తలంప రాదొకో

మ. పని యత్యల్పము దీనఁ గల్గెడు మహాప్రఖ్యాతి శూన్యంబు స
జ్జనులన్ దీనికినై ఖలత్వమున స్వేచ్ఛం దిట్టుటల్ విత్తమీ
పనికై యెంతొ వ్యయించుటల్ తగునె సంభావింతురే పెద్దలో
జనులారా; యిఁకమీదనైన నిటులే సల్పంగ మానం జనున్.

మఱియొక్కమాట యాలకింపుఁడు.

చ. మనమున నీసుఁ బూనకుఁడు మాటల స్వేచ్ఛగ నాడఁ బోకుఁడే
జనులకుగాని తిట్టకుఁడు సాధుపథంబు సమాశ్రయింపుఁడో
ర్వనఁదగువారి మిత్రులుగఁ బూనికఁ గైకొనుఁ డిట్లు చేసినన్
బనినెఱవేఱినన్ జెడిన స్వాంతము తృప్తిని గాంచునెంతయున్.

అని పలికి మఱియొకదిక్కు మొగంబై చెయియెత్తి యయ్యలారా! ఆగ్రహింపక యొక్కమాట నాలకింపుఁడు.

సీ. ఇదెమీకు సమ్మతి నిత్తునే సంశయ
మును బొందకేగుమా యనుచుఁబలికి
వేఱొక్కరుఁడురాఁగ వేడుక నీకిత్తు
సమ్మతి నేనని చక్కఁజెప్పి
మఱియొక్కరుఁడు రాఁగ మమత నాతనికి
సమ్మతినొసంగుదునంచు మాటయిచ్చి
యింకొక్కఁడరుదేర నిదెనీకు సమ్మతి
నిత్తునుబొమ్మని హితముగరపి

తే. యిన్నియును వీటిఁబుచ్చి యాత్మేచ్ఛమఱియొక
రికిని సమ్మతినిచ్చినఁ బ్రకటధర్మ
మేటిపాల్గాదయేటికీ బూటకములు
మాటతప్పకుఁడీఁక సైన మాన్యులార.

చ. ఒకరికి మేలుచేయుటయు యొప్పదెయంచు వచింతురేమొ దీ
నికిఫలమేమొయం చొగిలి నీతిఁదలంచినఁ గానవచ్చుఁగా;
యకటకటా! నిజంబు విపినాంతరమొందెదు నట్లుచేసినా
లుకఁ జెడఁజేయనేల? యిది లోపముగాఁ దలపోయరే బుధుల్.

ఇంకొక్కమాట చిత్తగింపుఁడు.

సీ. విద్యాధికులమంచు విఱ్ఱవీఁగిన నేమి
సత్ప్రవర్తనమున సాగవలయు

లోకవిజ్ఞానంబు మాకున్నదన నేమి
  తథ్యంబు మేలని తలఁపవలయు
శిష్యులకునుబోధ చేయుదుమన నేమి
  తమవాక్కురీతి వర్తనమువలయు
సత్కులజులమంచుఁ జాలఁబల్కిన నేమి
  యుత్తమగుణముల నొప్పవలయు
తే. గానియటు లేకయున్న సన్మానమున్నె
గౌరవము మాయదే కలకాలమపయశ
మలముకొనదే జగంబున లలన లైన
బరిహసింపరె మీరేటి పురుషు లనుచు.

అని గట్టిగాఁ బలుక నెల్లవారు సరిసరి యనిరి. ఇట్లే ప్రవర్తించినఁగాని మర్యాద రాదనిరి. చకోరకమింత న్యాయ సమ్మతముగాఁ బలుకునని తలంపమైతిమి. మాసమ్మతులను వ్యర్థము చేసికొంటిమని కొందఱు చింతించిరి. ఇంకను కొందఱు మోసపుఁబలుకులకు మోసపోతిమి చకోరమును నిందించి పాపముగట్టుకొంటిమి సత్యమేజయించెను దేహబలము ధన బలమునను నీరెండింటికంటె దైవబలమే బలమని స్పష్ట మయ్యెఁ గదా. ఇంకనైన బుద్ధిగలిగి సాధువుల నిందింపరా దని నిశ్చయించుకొనిరి. ఇట్లు మాట్లాడుచుండఁగా నొకకోలా హల ముప్పతిల్లెను. రాజు సుదర్శనుఁడు లేచి యిట్లుపన్య సించెను.

మహాశయులారా! ఈప్రయత్నమునందు సాగిన విష యముల గుఱించి నాలుగుమాటలు చెప్పెదను. వారిని జక్కఁగా మదినునుచుకొని యిఁకనైనఁ బ్రవర్తింపవలయునని మిమ్ముం గోరుచున్నాఁడను. వాని నాలకింపుఁడు. దేశక్షేమ

మును ప్రధానముగాఁ బరికింపవలయును. ప్రజాక్షేమమట్టిదే
యని యెఱుంగఁదగు. వ్యక్తియం దభిమానమునుంపరాదు.
ఈర్ష్యయును నుంపరాదు. పెద్దపిన్నయను తారతమ్యమును
విడనాడరాదు. కార్యసిద్ధికై చేయుప్రయత్నము మర్యాదతప్పి
యుండరాదు. కార్యావసరము ననుసరించి తప్పుత్రోవలఁ
ద్రొక్కరాదు. మానవబలము కలదుగాన మనయత్నము
నెఱవేఱునని గర్వింపరాదు. దైవబలమే ప్రధానమనియు
నదియే గెలుచుననినమ్మి యుచితరీతిఁ దాఁబ్రయత్నింప
వలయు. మోసముచేయఁ దలంపరాదు. అది తనకు నపకార
మొనరించుననియె నమ్మవలయును. పెద్దలు విన్నను సంతో
షించునట్లు ప్రయత్నము లుండవలయును. మఱియు గెలిచిన
నోడిన మిన్నందక ఖేదమందక యుండుటయే సజ్జనుల లక్ష
ణము. ఈవిజయపరాజయములు క్షణభంగురములు. వీనిని
నమ్మరాదు. కార్యమునం దసత్యములాడి యొరుల వంచింప
రాదు. అట్టివారు క్షుద్రులేయగుదురు. వారేనాటికి వృద్ధికాఁ
జాలరు. విజయమునకుప్పొంగి ద్రవ్యము లెక్కసేయక
వ్యయించి తెలివితక్కువ కార్యములు చేయరాదు. అప
జయము నందినవారిని దిరస్కరింపరాదు. అది తననుదానే
తిరస్కరించుకొని నట్లగును. అట్టిదుష్కార్యములు చేయువారిని
సాధువు లాదరింపరు. వారికేనాటికి మేలుగలుగదు. తనగుట్టు
కనుఁగొన సాధ్యముకానిదని యాడినమాటను దప్పరాదు.
దానఁగలుగు పాపఫలము ఇతరులనుభవింపక తానే యనుభ
వింపవలసియుండునని యూహింపవలయు క్షుద్రుల చెలిమిచేసి
సాధించుకార్య మపకీర్తిందెచ్చుననియు దానసుఖములేదనియు

మనశ్శాంతికది మార్గము కాదనియు నిశ్చయించుకొనవలయు. సర్వదా సర్వథాధర్మపక్షమే జయించుననియు నమ్మవలయును. సత్ప్రవర్తనము నిరంతర సుఖదాయకమని సంభావింపవలయును. మిమ్ముంజూచి సామాన్యులు ప్రవర్తన మలవఱచుకొనునట్లు వర్తించుటయే మీకు విధి. ఎవ్వారెవ్వరి మనసుల నేకొంకులున్నను వాని మాని మైత్రిగల్గి వర్తింపవలయును. విశేషించి వక్కాణింపక యింతతో నీయుపన్యాసమును ముగించుచున్నాఁడను. అని మహీపాలుఁడు సుదర్శనుఁడు తన యుపన్యాసమును జాలించెను. ఎల్లవారును రాజోపన్యాసమును విని యానందించిరి. కొందఱు తమరుచేసిన మోసమును దలంచుకొని యిట్టి తెలివితక్కువ కార్యము లిఁకఁ జేయమని యొట్టుపెట్టుకొనిరి. అందుఁ గొందఱు పౌరుషమున నింకొక్కసారి యిట్టిప్రయత్నము రాఁగా నింతకంటె గట్టి ప్రయత్న మొనరించి జయింపవలయునని నిశ్చయించుకొనిరి.

ఆవలఁ గంకనాయకుఁడు తత్పరిజనులు మోములు వేలవైచుకొని యెవ్వరిమోములను జూడఁజాలక తమపౌరుషము నిష్ఫలమగుటకు దుఃఖించుచు ధనవ్యయమునకుఁ బరితపించుచు నింతటి ప్రయత్నమునకు ఫలముగలుగక పోయెనే యని భగవంతుని దూఱుచుఁ జకోరము స్వల్పప్రయత్నముచేసి నను గెలిచెఁగాదాయని యసూయఁ గనఁబఱచుచు మోసము సాగినదని యందఱి నాక్షేపించుచుఁ దమ దూతల నూఱడించుచు నింకొక్కసారి చూతమని పంతములు వలుకుచుఁ దమరుచేయనెంచిన మహోత్సవప్రయత్నముల నెల్లరు పరిహసింతురని తలలువంచుకొనుచుఁ జకోరమున కింతటి సహా

-యము గల్గుటకేమికారణమని విచారించుచు, దుష్ప్రయత్న ములు ఫలింపవన్న పెద్దలమాటల స్మరించి తమ యవివేక మునకుఁ గుందుచు నేమియుఁ జేయునదిలేక తమకై సిద్ధ ముగ నుంచిన పూలహారములఁగాంచి కన్నీరు వదలుచు నెలవులకుం బోయిరి.

చకోరము తన మిత్రములగు పిక ప్రభృతులం గూడి యేమియు నార్భాటము చేయక పెద్దలగాంచినఁ దలవంచుచుఁ బిన్నలంజూచిన సంతసమున మాటలాడుచుఁ దనకు సాయ పడి ధర్మమార్గమున నిల్చినవారిని బహూకరించుచుఁ బ్రతి పక్షులనుగూడఁ దృణీకరింపక మిత్రములుగా భావించుచుఁ దన కృత్యమును న్యాయపద్ధతి మీఱ నెఱవేర్పఁ దలం చుచుఁ దనయింటికింబోయి సంతోషమునఁ గాలము గడపు చుండెను.

కం. మంగళము సత్ప్రవృత్తికి
మంగళము మహాత్ములైన మానివరులకున్
మంగళము సూనృతమునకు
మంగళము బుధేంద్రతతికి మైత్రికి సతమున్.

స్వస్తి. స్వస్తి. స్వస్తి.

శ్రీ శ్రీ శ్రీ

విహంగవిజయము సంపూర్ణము.

---

# ప్ర క ట న ము

ఆర్యులారా !

శ్రీ రామావతారతత్త్వమునకుఁ దోడుపడఁ గోరువారలీనిబంధనములఁ బాటింపవలయును.

25 రూప్యముల నొసంగువారు రాజపోషకు లనఁబడుదురు. వారల కిద్దాని ప్రకరణముల నన్నింటిని దారికర్చులు భరించి పంపఁబడును.

10 రూ॥ ఒక్కసారి యొసంగువారు పోషకు లనఁబడుదురు. ఒక్కొక్క ప్రకరణ మొక్కరూప్యమువంతున దారికర్చులు భరించి వారికిఁ బంపఁబడును. ఈరెండు తెగలమహాశయుల పవిత్రనామధేయము లిందుఁ బ్రకటింపఁబడుచుండును.

1 రూప్యము ముందుగాఁ బంపువారు చందాదారు లనఁబడుదురు. వారికిఁ బ్రతిప్రకరణము వీ. పీ. ర్వూ 1-4-0 లకు పంపఁబడును.

చందాదారులు కాని వారలకుఁ బ్రకరణమొక్కొక్కటి ర్వూ. 1-4-0 లకు నీఁబడును. పోస్టుకర్చులు ప్రత్యేకము.

శ్రీరామావతారతత్త్వము, 1 మొదలు 8 భాగములు అచ్చయి సిద్ధముగా నున్నది. ఒక్కొక్కభాగము ధర ర్వూ. 1-4-0

# స్వంతగ్రంథములు

వచనము.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీకృష్ణావతారతత్త్వము, 12 సంపుటములు. ఒక్కొక్కటి | | 1 | 8 |
| 12 సంపుటములు ఒక్కసారి కొనినవారలకు | ... | 16 | 0 |
| భగవద్గీత, వచనము, మూలముతోటి | ... | 1 | 0 |
| ఉత్తమమార్గము, భక్తిరసము | ... | 0 | 10 |
| స్వప్నయాత్ర, నవల | ... | 0 | 10 |
| నీతిసింధువు ,, | ... | 0 | 10 |
| నీతిరత్నాకరము ,, | ... | 0 | 8 |
| నీతికథావళి ,, | ... | 0 | 8 |
| సత్ప్రివర్తనము | ... | 0 | 10 |

పద్యములు - నాటకములు.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రశ్రీమద్రామాయణము, నిర్వచనము, 3 సంపుటములు | | 12 | 0 |
| ,, 7 ,, | ... | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| తెలుఁగుబ్రహ్మపురాణము | ... | 4 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| హనుమద్విజయము | ... | 0 | 8 |
| హాలాస్యమాహాత్మ్యము | ... | 1 | 0 |
| సర్వమంగళాపరిణయము ప్రబంధము | ... | 1 | 4 |

తాండవకృష్ణభాగవతము, దశమస్కంధమున కిది తెలుఁగు. మూలము వదలకుండఁ దెనిఁగింపఁబడినది. అయిదు వేల రెండువందల పద్యములు గలవు. 3-8-0

జనమంచి శేషాద్రిశర్మ,
కడప.